# వికసించిన మొగలి





మూలం :

నసీమ్ హిజాజీ

అనువాదం :

సయ్యద్ హుసైన్




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
అక్కడ్‌కోట్, ఛత్తా బజార్,
హైదరాబాద్ - 500002

ప్రథమ ముద్రణ : డిసెంబర్ 1989

ప్రతులు : 2000



వెల : రు. 5-00

ప్రకాశకులు :
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,
హైదరాబాద్ – 500 002

ముద్రణ :
కాస్మిక్ ప్రింటర్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,
హైదరాబాద్-500 002.

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# హజ్రత్ యూసుఫ్ (అలైహి) బాల్యం

హజ్రత్ యూసుఫ్ (అలైహి) దేవుని ప్రసిద్ధ ప్రవక్తల్లో ఒకరు. వీరి తండ్రి యాఖూబ్ (అలైహి) కూడా ప్రవక్తే. తాత హజ్రత్ ఇస్‌హాఖ్ (అలైహి), ముత్తాత హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) కూడా ప్రవక్తలే. హజ్రత్ యాఖూబ్ (అలైహి) కన్‌ఆన్ పట్టణం(సిరియా)లో నివసించేవారు. హజ్రత్ యూసుఫ్ అక్కడే జన్మించారు.

దేవుడు తన గ్రంథమైన దివ్యఖుర్‌ఆన్‌లో యూసుఫ్ (అ) వృత్తాంతమంతా తెలిపాడు. వృత్తాంతాల్లోకెల్లా దీన్ని మంచి వృత్తాంతంగా తెలియజేశాడు. ఇప్పుడు అటువంటి అహ్‌సనుల్ ఖసస్ (గాథల్లోకెల్లా మంచి గాథ)ను మనం తెలుసుకొందాము. ఈ గాథ మనకు అత్యంత మనోరంజకమేగాక గుణపాఠ యోగ్యమయిందీనూ. మనమూ విని అందులోని మంచిని గ్రహిద్దాము.

హజ్రత్ యూసుఫ్ (అ)తో కలిపి వారు పన్నెండు మంది సోదరులు. వీరిలో బిన్ యమీన్ మరియు హజ్రత్ యూసుఫ్

(అ) ఒక తల్లికి పుట్టిన సహోదరులు. మిగతావారు సవతి సోదరులు. పుట్టుకతోనే హజ్రత్ యూసుఫ్ (అ) చాలా అందమయినవారు, సాధుశీలురు, ఎంతో బుద్ధిమంతులూనూ. ఆయన తన ఎక్కువ సమయాన్ని తండ్రి యాఖూబ్ (అ)తో కలిసి దైవారాధనలోనే గడిపేవారు.

ఒకనాటి సంఘటన. హజ్రత్ యూసుఫ్ (అ) నిద్ర నుండి మేల్కొని యాఖూబ్(అ)తో అన్నారు, "నాన్నా! రాత్రి నేను ఓ కల గన్నాను, ఆ కలలో పదకొండు నక్షత్రాలు మరియు సూర్యచంద్రులు నాకు సాష్టాంగపడుతున్నాయి," ఆ కల వృత్తాంతాన్ని విన్న హజ్రత్ యాఖూబ్ (అ), ''కుమారా! ఈ కలను నీవు నీ సోదరులకు వినిపించకు. ఇది వింటే వారు నిన్ను కష్టపెట్టొచ్చు. దీని వలన నాకో విషయం బోధపడుతోంది. దైవం నిన్ను తన కార్యనిర్వహణకై ఎన్నుకుంటాడు. నిన్ను తన ప్రవక్తగా నియమిస్తాడు నీకు ఉత్తమ జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. ఏ విధంగానైతే నీ తాత ఇస్హాఖ్(అ) మరియు ముత్తాత ఇబ్రాహీం (అ)లను తన ప్రవక్తలుగా నియమించాడో, అదే విధంగా నీపై కూడా దైవం తన అనుగ్రహాన్ని జూపనున్నాడు.''

ఈ కల వృత్తాంతం విన్న తరువాత హజ్రత్ యాఖూబ్ (అ) హజ్రత్ యూసుఫ్ [అ]ను తన చెంతనుంచసాగారు. ఒక్క క్షణమయినా వారిని విడిచిపెట్టి ఉండేవారు కాదు. ఇది సవతి సోదరులకు గిట్టలేదు. వారంతా యూసుఫ్(అ)అంటే మండిపోయేవారు. ఈ అసూయ ఎంతగా పెరిగిందంటే వారంతా హజ్రత్ యూసుఫ్ (అ)ను మట్టుపెట్టాలనే తలంపుకు వచ్చారు అన్నదమ్ములంతా కలిసి మేకలు కాయడానికి అడవికి వెళ్ళేవారు.

తండ్రికి నచ్చజెప్పి యూసుఫ్ (అ) ను ఒక రోజు అడవికి తీసి కెళ్ళాలని నిశ్చయించుకున్నారు.

హజ్రత్ యూసుఫ్ (అ)ను అడవికి తీసికెళ్ళిన పిదప వారంతా ఆయన్ని పట్టి ఒక బావిలో పడేశారు. ఇంటికొచ్చి హజ్రత్ యాఖూబ్ (అ)తో యూసుఫ్‌ను తోడేలు పట్టుకెళ్ళిందని చెప్పారు. ఇది విని హజ్రత్ యాఖూబ్ (అ) ఎంతో దుఃఖించారు. "అహ! నా యూసుఫ్!" అంటూ నిట్టూర్చి దైవంతో మొరపెట్టుకుని ఊరుకున్నారు.

బాల్యం నుంచే హజ్రత్ యూసుఫ్ (అ) ఎంతో మంచివారు. వారికి తన సోదరులు ఎన్ని బాధలు పెట్టినా పల్లెత్తు మాట కూడా అనేవారు కారు. ఆయన తన్ను బావి నుంచి విముక్తి కలిగించమని దైవంతో ప్రార్థించారు. దైవం వారి ప్రార్థనను ఆలకించాడు. అప్పుడే అటువైపుగా ఓ ప్రయాణీకుల బిడారు వెళ్తోంది. వారంతా దప్పికగొని బావి వద్దకు వచ్చారు. ఒక మనిషిని బావిలోంచి నీటిని తోడి తీసుకురమ్మన్నారు. అతను బావిలో చేద వేసి, అందులో ఒకఅందమయిన బాలుడుండటం గమనించాడు. అతనెంతో సంతోషించి, తోటి ప్రయాణీకులతో ఈ విషయం చెప్పాడు. అంతా కలిసి బాలుణ్ణి పైకి తీసారు. వారంతా ఈజిప్ట్‌కు వెళ్తున్నారు. ఆ పట్నం చేరుకున్న తరువాత యూసుఫ్ (అ) ను వారు అమ్మేశారు.

అవును! యూసుఫ్ (అ) ను అమ్మి వేశారు. ఆ రోజుల్లో పురుషుల్ని, స్త్రీలను మరియు బాలల్ని కూడా అమ్మే వారు. ఈ విధంగా అమ్మబడిన పురుషులు, బాలలు బానిసలు గాను, స్త్రీలు బానిసరాళ్ళుగానూ పిలువబడేవారు. చూడండి,

ఓ ప్రవక్త కుమారుడు ఈజిప్ట్ చేరి బానిసగా మారిపోయాడు! హజ్రత్ యూసుఫ్(అ)ను ఓ ధనిక కుటుంబీకుడు కొన్నాడు. ఇలా యూసుఫ్ (అ) అతనింట వుంటూ వున్నారు. ఆ సమయంలో ఈజిప్ట్ రాజు ఓ కలగన్నాడు. అతను విద్వాంసుల్ని, జ్యోతిష్కుల్ని పిలిపించి తన కల అంతరార్థాన్ని విచారించాడు. అయితే ఎవ్వరూ దాని అర్థాన్ని చూపించలేకపోయారు. ఈ కలను హజ్రత్ యూసుఫ్ (అ) విని దాని మర్మం చెప్పడమే గాక ఆ తరువాత రాజు కర్తవ్యాన్ని కూడా బోధపరిచారు. యూసుఫ్ (అ) సూక్ష్మదృష్టిని, ఆలోచనా తీరును గమనించిన ఆ రాజు "మీరు చెప్పిన నా కర్తవ్యాన్ని మీరే నిర్వర్తించండ''ని తన రాజ్య పరిపాలనా బాధ్యతను యూసుఫ్ (అ)కు ఇచ్చివేశాడు హజ్రత్ యూసుఫ్ (అ) రాజ్య పరిస్థితుల్ని అదుపులో ఉంచారు ఈయన పరిపాలనలో ప్రజలు సుఖశాంతులను పొందారు. ఆయన (అ) తన తల్లిదండ్రుల్ని మరియు సోదరులను కూడా ఈజిప్ట్‌కు రప్పించుకున్నారు. వీరంతా ఈజిప్ట్ చేరుకున్న సమయంలో యూసుఫ్ (అ) రాజ్య సింహాసనంపై ఆసీనులై ఉన్నారు ఇది గమనించి వారంతా తలలు వంచి ప్రణామం చేశారు. దీన్ని గ్రహించి యూసుఫ్(అ), యాఖూబ్(అ)తో అన్నారు.

''నాన్నగారూ! ఇదే నా చిన్ననాటి కల యొక్క అంతరార్థం. మీరు మరియు అమ్మ సూర్య చంద్రులు, మరియు పదకొండు నక్షత్రాలు* నా సోదరులు. చూడండి అల్లాహ్

---

* **11 నక్షత్రాలు, సూర్యచంద్రులు నాకు సజ్దా చేసినట్లు నేను** కలగన్నాను.

ఆ కలను ఏ విధంగా నిజం చేసి చూపించాడో! నా ప్రభువు నా కెంతో మేలు చేశాడు. షైతాన్ మా సోదరుల్లో ఎడబాటు బీజాల్ని నాటాడు, అయితే దైవం ఏద్దైతే చేస్తాడో దాన్ని ఎవరూ గ్రహించలేరు. ఆయన అన్నీ తెలిసిన వాడు మరియు ఎంతో వివేకం కలవాడూను '' [సూరయె యూసుఫ్]

# హజ్రత్ మూసా (అ) బాల్యం

హజ్రత్ మూసా [అ] బాల్యం మిక్కిలి అసక్తికరమైనదే గాక మన విశ్వాసాన్ని పెంపొందించేది కూడా. వీరు దేవుని ప్రముఖ ప్రవక్తల్లో ఒకరు. ఈయన విషయం దివ్యఖుర్‌ఆన్‌లో పలుచోట్ల ప్రస్తావించబడింది. ఈయన జననం ముస్లిం ఇంట అయితే, పెంపకం అవిశ్వాసి అయిన ఓ రాజు ఇంట జరిగింది.

వీరి కాలంలో ఓ చక్రవర్తి ఉండే వాడు. ఆయన పేరు ఫిర్ఔన్. ఆయన తనను అందరిచేత దైవంగా పిలిపించుకునే వాడు. ఫిర్ఔన్ కాలంలో ప్రభవించిన ప్రముఖ ప్రవక్త యొక్క వంశ ప్రజలు అధిక సంఖ్యలో ఉండేవారు. వీరిని ''బనీ ఇస్రాయీల్'' అని పిలిచేవారు. అయితే ఫిర్ఔన్‌కు ఈ

వంశస్థులంటే గిట్టేది కాదు. ఎక్కడ వీరంతా తిరగబడి తన రాజ్యాన్ని ఆక్రమించుకుంటారోననే భయం కూడా అతనిలో ఉండేది. అందువల్ల ఆ వంశస్థుల్ని పలువిధాల కష్టాలపాల్జేస్తూ ప్రతి చిన్న విషయంపై కూడా రక్తపాతం జరిపించేవాడు. అంతేగాక బనీ ఇస్రాయీల్ తెగలో మగ పిల్లలు జన్మిస్తే చంపమని, ఆడ సంతానమైతే బ్రతకనివ్వమని ఆజ్ఞను జారీ చేయించాడు. వారి స్త్రీ సంతానాన్ని తన దాసీ జనంగా భావించి ఊడిగం చేయించుకునేవాడు. ఈ విధంగా రోజుకు రోజు బనీ ఇస్రాయీల్ తెగ తరిగిపోసాగింది. వీరంతా విశ్వసించిన ముస్లింలు. వీరి విశ్వాసం తరిగిపోయిన సంగతి వాస్తవమే అయినప్పటికీ వారు ఫిర్ఔన్‌ను దేవునిగా పరిగణించడానికి మాత్రం సిద్ధంగా లేరు. ఆ సమయంలో దేవుని మహిమ చూడండి. ఆ వంశంలో హజ్రత్ మూసా [అ] ప్రభవించారు. వీరి తల్లి ఎంతో విజ్ఞత మరియు దేవుని పట్ల మిక్కిలి విశ్వాసం కలది హజ్రత్ మూసా (అ) జననం విషయం ఫిర్ఔన్‌కు తెలిస్తే పిల్లవాణ్ణి అంతమొందిస్తాడని గ్రహించి, ఆమె మూసా (అ)ను ఒక పెట్టెలో పెట్టి దాని మూత బిగించి నైలు నదిలో వదిలివేశారు. నది ఒడ్డున నడుస్తూ అది ఏ చోటకు చేరుతుందో చూసి రమ్మని ఆమె తన కుమార్తెను వెంట పంపారు. తల్లి చెప్పినట్లుగానే ఆ పిల్ల ఆ పెట్టెను గమనిస్తూ నది ఒడ్డునే నడవసాగింది.

ఇలా కొంత దూరం వెళ్ళిన పిదప ఫిర్ఔన్ రాజభవనం వచ్చింది. నైలునది అందాలను తిలకిస్తూ ఫిర్ఔన్ భార్య మేడపై నిలబడి వుంది. ఆమె వద్దునే వస్తున్న పెట్టెను గమనించి దాన్ని తన వద్దకు తీసుకురమ్మని సేవకులను ఆజ్ఞాపించింది. వెంటనే

ఆ పెట్టె ఆమె వద్దకు తీసుకువచ్చారు. దాని మూత తెరవగా అందులో బాబు కనిపించాడు.

ఆమెకు సంతానం లేని కారణాన ఆ బాలుణ్ణి పెంచుకోసాగింది. ఇది గమనించిన ఫిర్ఔన్‌కు అనుమానం కలిగింది. పిల్లవాణ్ణి అంతమొందించమని ఆజ్ఞాపించాడు. కాని తన భార్య ఎంతో నచ్చజెప్పడం మూలాన పిల్లవాడు బ్రతికిపోయాడు.

పిల్లవానికి పాలు పట్టడానికి ఓ ఆయా అవసరమేర్పడింది. అందుకుగాను ఈజిప్ట్‌లోని ఆయాలకు కబురంపడం జరిగింది. పిల్లవాడు ఏ ఒక్కరి పాలను త్రాగలేదు. పెట్టె వెంటనే వచ్చిన మూసా (అ) సోదరి ఈ విషయం గమనించి "మీరు అనుమతిస్తే నేను ఓ మంచి ఆయాను తీసుకువస్తా"నని చెప్పింది. వెంటనే తీసుకురమ్మని ఆజ్ఞాపించింది ఫిర్ఔన్ భార్య. వెంటనే ఆమె ఇంటికిచేరి తన తల్లితో జరిగిన వృత్తాంతాన్నంతా విన్పించి, తల్లిని వెంటబెట్టుకొని రాజమహలుకు వచ్చింది. ఆమె పిల్లవానికి పాలుపట్టారు. ఆ విధంగా ఫిర్ఔన్ దర్బారులో ఆమెకు ఆయాగా ఉండే అవకాశం లభించింది.

దేవుని మహిమ ఎంత గొప్పది! హజ్రత్ మూసా (అ) తన శత్రువు ఇంట పెరిగి పెద్దవారయ్యారు దైవం వారిని ప్రవక్తగా నియమించి ఈజిప్ట్ ప్రజల్ని దైవదాస్యం వైపుకు పిలిచే బాధ్యతను వారిపైనే మోపాడు. ఈ విషయంపై ఫిర్ఔన్‌తో ముఖాముఖి జరిగింది. ఫిర్ఔన్ తలబిరుసుతనం ప్రదర్శించాడు. దైవం ఫిర్ఔన్‌ను, అతని సైన్యాన్ని సముద్రంలో ముంచేశాడు.

ఈ విధంగా బనీ ఇస్రాయీల్* వంశానికి శత్రువు బారి నుండి విముక్తి లభించింది.

—)o(—

---

* బనీ ఇస్రాయీల్ అంటే "ఇస్రాయీల్ సంతతి" అని అర్థం. హజ్రత్ యాఖూబ్ (అ) ప్రవక్తను ఇస్రాయీల్ అని కూడా అంటారు. వారికి కలిగిన సంతానమే బనీ ఇస్రాయీల్‌గా పిలువబడ్డారు. హజ్రత్ యాఖూబ్ (అ)కు హజ్రత్ యూసుఫ్ (అ) అనే ప్రియకుమారుడు కలిగారు. హజ్రత్ యూసుఫ్ (అ) కూడా ప్రఖ్యాత ప్రవక్తగా పేరు గాంచారు. దైవం ఆయనకు ఈజిప్ట్ రాజ్యాధికారాన్ని ప్రసాదించాడు. యూసుఫ్ (అ) తన తల్లిదండ్రుల్ని మరియు సోదరులను ఈజిప్ట్‌కు రప్పించుకుని పట్టణం నుండి వేరుగా నివాసమేర్పరిచారు. హజ్రత్ యూసుఫ్ (అ) తరువాత ఈజిప్ట్ నివాసులు ఇస్రాయీల్ సంతతితో శత్రుత్వం వహించి వారిని హింసించడం మొదలుపెట్టారు.

# హజ్రత్ సులైమాన్ (అ) బాల్యం

హజ్రత్ సులైమాన్ (అ) దేవుని ప్రవక్త. వీరి తండ్రి హజ్రత్ దావూద్ (అ) కూడా దైవ ప్రవక్తే. దైవం వీరిద్దరినీ తన ప్రవక్తలుగా ఎన్నుకోవడమే గాక ఇద్దరికీ రాజ్యాధికారాన్నీ ప్రసాదించాడు. హజ్రత్ సులైమాన్ (అ)కు దైవం పశుపక్ష్యాదుల భాషల్ని కూడా అర్థం చేసుకునే జ్ఞానాన్నీ ప్రసాదించాడు. జిన్నులపై, గాలిపై కూడా అధికారం చెలాయించే శక్తిని దైవం వీరికి ఇచ్చాడు.

బాల్యంలోనే సులైమాన్ (అలైహి) తల్లి వీరికి ఎన్నో మంచి విషయాల్ని గురించి ప్రబోధించేవారు నమాజ్ చేసే విషయంలో గట్టి తాకీదు చేసేవారు. సులైమాన్ (అ)కు వీరి తల్లి "కుమారా! రాత్రంతా నిద్రలో గడపవద్దు. ఎందుకంటే నిద్ర మానవుణ్ణి మంచి పనుల నుండి నిరోధించి ప్రళయదినాన దిక్కులేనివాణ్ణిగా చేస్తుంది." అని బోధించేవారు.

హజ్రత్ సులైమాన్ (అ) తల్లి హితవులను ఎంతో శ్రద్ధతో విని వాటిని ఆచరించేవారు. దైవం వారికి ఎంతో గ్రహణశక్తినీ ఇచ్చాడు. వీరి పిన్న వయస్సులోని సంఘటనల ద్వారా బాల్యంలోనే వీరు ఎంత తెలివైనవారో మనకు తెలుస్తుంది.

ఒకసారి హజ్రత్ దావూద్(అ)న్యాయస్థానంలో ఓ వ్యాజ్యం విచారణ జరుగుతోంది అప్పుడు సులైమాన్(అ)కూడా అక్కడే వున్నారు. అప్పుడు ఆయన వయస్సు కేవలం 11 సంవత్సరాలే. వ్యాజ్యమేమంటే ఒక వ్యక్తి పంటచేను మొత్తాన్ని మరొకరి మేకలు మేసి తొక్కివేసాయి. దాదాపు మేకల మొత్తం ఖరీదు ఎంతో, పంట పొలం తాలూకు జరిగిన నష్టం అంతే వుంది. దీనిపై హజ్రత్ దావూద్ (అ) రైతుకు జరిగిన నష్టానికి బదులుగా మేకలన్నింటినీ రైతుకివ్వవలసిందిగా తీర్పు ఇచ్చారు.

హజ్రత్ సులైమాన్ (అ) కూర్చొని ఇదంతా గమనిస్తూనే వున్నారు. తండ్రి తీర్పును విని, "నాన్నా! మీరిచ్చిన తీర్పు బాగానే వుంది. పొలం యజమానికి జరిగిన నష్టం అతనికి రావలసిందే కాని అంతకంటే మంచి పద్ధతి నా మెదడులో మెదలుతుంది" అని అన్నారు.

"ఆ పద్ధతి ఏమిటీ" అని హజ్రత్ దావూద్(అ) తనయుని అడిగారు దానికి సులైమాన్ (అ) "మేకలన్నిటినీ రైతుకు అప్పజెప్పాలి. రైతు వాటి పాలు సేవిస్తూ వాటిపై వచ్చే తదితర లాభాలు కూడా తాను పొందుతూ ఉండాలి. మేకల యజమాని రైతు పొలంలో తిరిగి విత్తనాల్ని జల్లి పంట కాపుకొచ్చేంత వరకు సేద్యం చేసి దాన్ని రైతుకు అప్పజెప్పి, తన మేకల్ని తాను వాపసు తీసుకోవాలి" అని అన్నారు.

తనయుని తీర్పు ఎంతో నచ్చింది. హజ్రత్ దావూద్(అ)కు ఆయన ఇలాగే చేయండని ఆజ్ఞాపించారు.

రెండవ వ్యాజ్యంలో ఇంకా ఎంతోవివేకంతో తీర్పునిచ్చారు. ఆ వ్యాజ్యం కూడా చాలా ఆసక్తికరంగా ఉంటుంది. అదేమంటే

ఇద్దరు స్త్రీలు ప్రయాణం చేస్తున్నారు. ఇద్దరి వద్దనూ ఒక్కో పిల్లవాడున్నాడు. ఒక రాత్రి ఇద్దరూ ఒకే చోట బస చేశారు. పెద్ద వయస్సుగల స్త్రీ పిల్లవాడ్ని తోడేలు పట్టుకెళ్ళింది తెల్లవారిన పిదప పిన్న వయస్సు స్త్రీ బిడ్డను తాను బలవంతాన లాక్కొని ఈ పిల్లవాడు తన కుమారుడే అన్నది పెద్ద వయస్సు స్త్రీ. ఆ పై ఇద్దరూ తగవులాడుకున్నారు. ఈ సమస్య హజ్రత్ దావూద్(అ) న్యాయస్థానానికి వచ్చింది. పెద్ద స్త్రీ చాకచక్యంతో చేసిన మాటల తీరుకు ప్రభావితులయి దావూద్ (అ) పిల్లవాణ్ణి ఆమెకే అప్పగించారు. పిన్న వయస్కురాలు ఏడుస్తూ న్యాయస్థానాన్నుండి బయటపడింది: మార్గంలో సులైమాన్ (అ) కలిసి విషయాన్ని అడిగి తెలుసుకున్నారు. హజ్రత్ సులైమాన్ (అ) ఇద్దరు స్త్రీలను పిలిపించి పిల్లవాడ్ని తీసుకున్నారు. బాలుడ్ని రెండు ముక్కలుగా చేసి చెరో భాగం ఇవ్వండని సేవకుల్ని ఆజ్ఞాపించారు.

ఈ ఉత్తర్వు విన్న పిదప చిన్న స్త్రీ ఇంకా తన ఏడ్పును అధికం చేసి "ప్రభూ! పిల్లవాణ్ణి చంపకండి. నా బాబును ఆమె వద్దనే ఉండనివ్వండి. పిల్లవాడు నా వద్ద లేకున్నా బ్రతికివుంటే అదే పది వేలు, దానికి బదులు నరికితే చనిపోతాడు" అని అన్నది. ఇది విని హజ్రత్ సులైమాన్(అ) ఈ పిల్లవాడు పిన్న వయస్సు స్త్రీకే చెందినవాడని అన్నారు. తనే స్వయంగా వెళ్ళి తండ్రి దావూద్ (అ)కు జరిగిన వృత్తాంతాన్ని వివరించారు. ఆ పై హజ్రత్ దావూద్ (అ) పిల్లవాణ్ణి చిన్నవయస్సుగల స్త్రీకి ఇప్పించి పెద్ద స్త్రీకి శిక్ష విధించారు.

# ప్రియ ప్రవక్త (సఅసం) బాల్యం

ప్రియప్రవక్త (సఅసం) బాల్య దశలో వున్నప్పుడు ఒక బాలుడు ఆయనతో "పట్నంలో ప్రజలు రాత్రి ఉత్సవం జరుపు కుంటారు. నీకు తెలుసా? ఒకరు ఆడుతూ వుంటే, ఆ ఆటను వేరొకరు తిలకిస్తూ వుంటారు. ఒకరు పాడుతుంటే మరొకరు దాన్ని వింటూంటారు. ఒకరు కథలు చెపుతూంటే వాటిని చెవి యొగ్గి మరొకరు వింటూంటారు. ఇంకా మరెన్నో మనసును ఉత్తేజపరిచే వేర్వేరు ఆటపాటలు జరుగుతుంటాయ"ని చెప్పాడు.

ఇది విన్న ఆయన (సఅసం)కు ఓ రాత్రి పట్నంలో జరిగే తమాషాల్ని చూడాలని మనస్సులో కోరిక కలిగింది. ఆ ఉద్దేశ్యం తోనే ఓ రోజు పట్నానికి బయలుదేరారు. కాని ఆయన[సఅసం] ఇలాంటి తమాషాల్లో చిక్కుకోవడం దేవునికి ఏ మాత్రం ఇష్టం లేకుండింది. బాల్యంలో కూడా ఆయన [సఅసం] పవిత్రంగా, పరిశుభ్రంగా వుండాలనేదే అల్లాహ్ అభిమతం. పట్నానికి బయలుదేరిన ప్రవక్త మహనీయులు మార్గంలో ఎదో పని మీద ఆగిపోయారు. తరువాత అక్కడే నిద్రలో జారుకున్నారు' భళ్ళున తెల్లవారింది.

అలాగే మరోసారి ఆ తమాషా చూద్దామని బయలుదేరారు. దారిలో మేనత్త ఇల్లు ఉండేది. మేనత్త తటస్థపడి, ఆయన్ని తనింటికి తీసుకెళ్ళారు. అక్కడే ఆ రాత్రి నిద్ర ముంచుకు వచ్చింది. లేచి చూస్తే తెల్లవారిపోయింది.

ప్రియప్రవక్త [సఅసం] చిన్న వయస్సు నుండే ఎంతో సిగ్గు, బిడియం కలవారు. ఒకసారి కాబా గోడ పడిపోయింది. మక్కా వాసులంతా కలసి దాన్ని ఎత్తనారంభించారు. వృద్ధులు, యువకులు మరియు బాలలు అంతా ఈ పనిలో నిమగ్నులయ్యారు. కొంత మంది కొండపై నుండి రాళ్ళు మోసుకొస్తున్నారు. కొందరు వాటిని ముక్కలుగా పగులగొడ్తున్నారు. ఇంకొందరు గోడ పేర్చడంలో నిమగ్నులయ్యారు. అప్పుడు ప్రవక్త [సఅసం] వయస్సు కేవలం 8 సంవత్సరాలే. ఆయన[సఅసం] కూడా రాళ్ళను మోసుకురావడం మొదలెట్టారు.

బాల ముహమ్మద్ కొండవద్దకు వెళ్ళి తమ భుజంపై రాయి ఎత్తుకుని కాబా మస్జిదు వద్దకు మోసుకొస్తున్నారు. మళ్ళీ పరుగు పరుగున వెళ్ళి రెండవ రాయిని అదేవిధంగా తీసుకొస్తున్నారు. ఆ విధంగా అనేక సార్లు చేయడం వలన ఆయన భుజం ఒడుసుకుపోయింది.

ఆయన[సఅసం]తోపాటు ఆయన బాబాయికూడా రాళ్ళను మోస్తున్నారు. ఆయన పేరు అబ్బాస్ [రజిఅన్]. ఆయన ప్రవక్త [సఅసం] కంటే వయస్సులో కొంచెం పెద్దవాడు ప్రవక్త [సఅసం] అంటె వారికి పంచ ప్రాణాలు. ముహమ్మద్ భుజం ఒడుసుకుపోవడం చూసిన అబ్బాస్ [రజి], ఆయన [సఅసం] లుంగీని విప్పేసి దాన్ని మడచి ఆయన [సఅసం] భుజంపై.

వుంచాడు. భుజంపై రాతినుంచటం వల్ల చర్మం ఒడిసిపోకుండా ఉంటుందనే ఉద్దేశ్యంతోనే అబ్బాస్ [రజి] ఆ విధంగా చేశారు.

మొలపైనున్న వస్త్రాన్ని తొలగించడం వలన ఆయన [సఅసం] సిగ్గుతో కృంగిపోయారు. తన పరిస్థితిని చూసుకుని ప్రవక్త [సఅసం] సిగ్గుతో స్పృహతప్పి పడిపోయారు. జనమంతా గుమికూడి ఆయనకు స్పృహ వచ్చేలా చేశారు. కొంచెం స్పృహ వచ్చిన పిదప ఆయన "నా అంగవస్త్రం, నా అంగవస్త్రం" అని కలవరిస్తున్నారు. అది గ్రహించి వెంటనే అక్కడున్న వారు నడుముకు లుంగీని కట్టిన తరువాత గానీ ఆయన [సఅసం] మనసు కుదుటపడలేదు. బాల్యంలోనే ప్రవక్త కనబరచిన సౌశీల్యానికి ఇదొక దృష్టాంతం.

—)o(—

# హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ [రజి] బాల్యం

హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ [రజి] ప్రవక్త [సఅసం]వారి ప్రియ సహచరులు. ఇద్దరూ ఒకరిపట్ల మరొకరు ఎంతో ప్రేమతో, అనురాగంతో ఉండేవారు. ప్రవక్త [సఅసం] అనుచరుల్లోకెల్లా వీరు పెద్దవారు మరియు సాధుశీలురు. మహనీయ ప్రవక్త [సఅసం] పరమపదించిన తరువాత ముస్లిములంతా కలసి వీరినే ఖలీఫా [ప్రాతినిధ్యపు పాలకుడు]గా ఎన్నుకున్నారు. హజ్రత్

అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) ఇస్లామీయ రాజ్య పరిపాలనా భారాన్ని ఎంతో చక్కగా నిర్వహించారు వీరి బాల్యంలో జరిగిన సంఘటన ఒక్కటి మాత్రమే మనకు పుస్తకాల్లో లభిస్తుంది.

ఆ సంఘటనను స్వయంగా ఆయనే (రజి) ప్రస్తావించేవారు, "నేను బాల్యంలో ఉండగా ఒకసారి నా తండ్రి అబూ ఖహాఫా నా చేయి పట్టుకుని నన్ను వర్తక స్థావరానికి తీసికెళ్ళారు. అక్కడ ఓ చోట విగ్రహాలుండగా వాటిలో ఒకదాన్ని చూపిస్తూ, ఇది పూజనీయమైంది*, దీనిముందు సాష్టాంగపడమని చెప్పి ఆయన నన్ను అక్కడే వదిలేసి పోయారు. అప్పుడు నేను ఆ విగ్రహం వద్దకు వెళ్ళి "నేను బట్టల్లేకుండా బాధపడుతున్నాను, నాకు బట్టలు ప్రసాదించమ"ని అన్నాను. అందుకు దాన్నుండి ఎలాంటి సమాధానం రాలేదు.

మళ్ళీ నేను, "ఆకలితో వున్నాను. అన్నం తినిపించమ"ని అన్నాను. అప్పుడు కూడా దాన్నుండి ఏ సమాధానం రాలేదు. ఆ తరువాత నేనొక రాతిని పైకెత్తి "నేను నిన్ను ఈ రాతితో కొట్ట బోతున్నా, నీవే నిజ దైవమయితే నిన్ను నీవు కాపాడుకో" అన్నాను అప్పుడూ ఏ సమాధానం రాలేదు. తరువాత ఆ రాతితో నేను దాని తలపై ఒక్క దెబ్బ వేయగా అది విరిగిపడిపోయింది.

—(०)—

---

* దైవంలా పూజకు, ఆరాధనకు అర్హత కలది.

# హజ్రత్ అలీ [రజి] బాల్యం

హజ్రత్ అలీ [రజి] మహనీయ ముహమ్మద్ ప్రవక్త (సఅసం)కు బాబాయి కుమారుడు, అల్లుడూను. బాల్యంలోనే ఆయన మంచి తెలివితేటలు, శౌర్యమూ కలవారు. వీరు బాల ప్రాయంలో వున్నప్పుడే మహనీయ ముహమ్మద్ (సఅసం)ను దేవుడు తన ప్రవక్తగా నియమించాడు. ఆ పిదప ప్రవక్త మహనీయులు (సఅసం) దైవ సందేశాన్ని విన్పించగా మొట్టమొదట ప్రవక్త పట్ల విశ్వాసాన్ని ప్రకటించిన అయిదుగురు సజ్జనుల్లో వీరూ ఒకరు. అప్పుడు హజ్రత్ అలీ (రజి)కు పన్నెండు సంవత్సరాలు కూడా నిండలేదు.

ప్రవక్తగా నియమింపబడిన కొద్ది రోజుల్లోనే మహనీయ ముహమ్మద్ (సఅసం) హజ్రత్ అలీ(రజి)తో విందు ఏర్పాటు చేయమని చెప్పగా, ఆయన (రజి) అలాగే ఏర్పాటు చేశారు. ఆ విందుకు ప్రవక్త (సఅసం) బాబాయిలు అబూతాలిబ్, హజ్రత్ అబ్బాస్ (రజి), హజ్రత్ హమ్జా(రజి) మరియు ఇంకా తదితర కుటుంబ సభ్యులంతా హాజరయ్యారు.

అందరూ విందు ఆరగించి కూర్చున్న సమయంలో ప్రవక్త (సఅసం) తమ ఉపన్యాసాన్ని మొదలెట్టారు, నేను ఏదయితే

ఉపదేశిస్తున్నానో దానితో మీ ప్రాపంచిక జీవితం మరియు పరలోక జీవితం సుఖవంతమౌతుందని ఆయన (సఅసం) సెల విచ్చారు. ఆ కార్యాలలో తనకు ఎవరు తోడ్పడగలరని అడిగారు.

ప్రవక్త (సఅసం) మాటలువిని అంతా నిశ్శబ్దం ఆవరిం చింది. ఎవరూ నోరు విప్పలేదు. అప్పుడు హజ్రత్ అలీ (రజి) వయస్సు కేవలం పన్నెండు సంవత్సరాలే. శారీరకంగా చూస్తే ఆయన కాళ్ళూ చేతులు చిన్నవిగా, బక్క చిక్కిపోయి ఉండేవి. ఆ రోజుల్లో ఆయన కండ్లనొప్పులతో బాధపడు తున్నారు. అలాంటి స్థితిలోనూ వారు ఆవేశ ఉద్వేగాలతో నిండి వున్నారు. ప్రవక్త (సఅసం) ఉపన్యాసాన్ని విన్న ఆయన (రజి) తన ఆవేశాన్ని ఆపుకోలేకపోయారు. పెద్దలంతా ఊలకుండ పలకుండా వున్న ఆ సభలో ముందుకొచ్చి దైవప్రవక్త (సఅసం) తో ఈ విధంగా అన్నారు; "నాకు కళ్ళజబ్బు ఉన్నమాట నిజమే. కాళ్ళూచేతులు సన్నగా చిన్నవిగా వుండి, నేను పిల్ల వాడిలా కనబడటం కూడా వాస్తవమే. కాని ఓ ప్రవక్తా! మీరు చేపట్టిన పనిలో నేను నా తోడ్పాటును ప్రకటిస్తున్నాన"ని పలికారు.

హజ్రత్ అలీ (రజి) మాటలు విని ఈ పిల్లవాడు ముహ మ్మద్ (సఅసం) పలికిన మాటలు విని ఇట్టే ఆవేశంలో ఏదో అనేస్తున్నాడని అంతా అవహేళనగా, ఒకింత ఆశ్చర్యంతో చూడ సాగారు.

కాని, ఆ బాలుడే ఇస్లాం కొరకు తన ప్రాణాన్ని త్యాగం చేయడం, ప్రవక్త (సఅసం) పేరును ఉన్నతంచేసి ఇస్లాం దిగ్వి జయంకొరకు పాటు పడటాన్ని ముమ్ముందు అంతా గ్రహించారు. దైవం ఆయనతో ప్రసన్నుడవు గాక !

# హజ్రత్ జైద్ బిన్ హారిస్ [రజి] బాల్యం

మానవునికి ఏదయినా కష్టం వచ్చినప్పుడు ఎంతో కలత చెందుతాడు. కాని, నిజానికి భవిష్యత్తులో ఆ కష్టాలే తనకు మహోన్నత శిఖరాలకు చేరవేస్తాయి. హజ్రత్ యూసుఫ్ (అ) ను వారి సోదరులు బావిలో పడదోశారు వారు ఈ దెబ్బతో యూసుఫ్ (అ) అంతమయినట్లేనని భావించారు. కాని దేవుడు తన మహిమతో వారిని బావినుండి వెలికి తీయించి ఈజిప్టుకు చేర్పించాడు. అక్కడ వారు (అ) బానిసగా అమ్మబడ్డారు; మరియు ఈజిప్ట్ రాజ్యానికి రాజు అయ్యారు. సరిగ్గా హజ్రత్ జైద్ బిన్ (రజి) ది కూడా ఇదే పరిస్థితి. దేవుని మహిమలు ఎవరూ గ్రహించలేరు.

ఒకసారి హజ్రత్ జైద్ (రజి) తన తల్లి వెంట అమ్మమ్మ గారింటికి బయలుదేరారు. అప్పుడు వారి వయస్సు ఏడు లేక ఎనిమిది సంవత్సరాలు. మార్గ మధ్యంలో వారిని దోపిడీ దొంగలు దోచుకున్నారు. ఆ దొంగలు హజ్రత్ జైద్ (రజి) ని తన తల్లి నుండి విడదీసి వారిని ఉకాజ్ వీధుల్లో బానిసగా అమ్మి వేశారు. ఇలాంటి పరిస్థితులు జైద్ తల్లిదండ్రులకు, స్వయంగా హజ్రత్ జైద్‌కు ఎంత బాధను కలుగజేసి ఉంటాయో అలో

క్షించండి. అయితే మున్ముందు ఈ కష్టాలే ఎంతో దైవానుగ్రహ భాగ్యాన్ని పొందేందుకు దోహద పడ్డాయని మనం గ్రహించ గలం.

వాస్తవంగా జరిగిందేమంటే జైద్ (రజి)కు ప్రియ ప్రవక్త ముహమ్మద్ (సఅసం) సతీమణి హజ్రత్ ఖదీజా (ర.అ) మేనల్లుడు హకమ్ బిన్ హజ్జామ్ బానిసగా కొనుక్కొని మక్కా తీసుకొచ్చి ఆయన్ని తన మేనత్త ఖదీజాకు కానుకగా సమర్పించాడు. తరువాత ఆమె (ర.అ) ఆయన్ని ముహమ్మద్ (సఅసం)కు నౌకరుగా అర్పించారు. మనిషికి ఇంతకన్నా గౌరవాదరణలు ఇంకేం కావాలి? యుక్త వయస్సుకుచేరిన పిదప జైద్ (రజి) తన గులాంగిరి పట్ల ఎంతోగర్వించేవారు. ఎట్టిపరిస్థితిలోనూ ప్రవక్త(సఅసం) సన్నిధిని వదలి వెళ్ళడానికి ఇష్టపడేవారు కాదు.

"జైద్ (రజి) ప్రవక్త (సఅసం) వద్ద బానిసగా ఉన్నప్పుడు ఆయన స్వదేశం యమన్‌లో కుమారుని ఎడబాటు పట్ల ఆయన తల్లిదండ్రులు ఎంతో విలపించేవారు. రేయింబవళ్ళు ఎంతో ఏడుస్తూ, బాధపడుతూ ఎన్నో ప్రదేశాలు వెదికారు. ఎతో కాలానికి తమ కుమారుడు మక్కాలో ముహమ్మద్ ప్రవక్త (సఅసం) వద్ద ఉన్నాడని ఎవరో చెప్పగా విన్నారు.

ఇది విన్న జైద్ (రజి) తండ్రి హారిస్ తన సోదరుడు కఅబ్ వెంట మక్కా చేరుకుని ప్రవక్త (సఅసం) సన్నిధికి వచ్చారు. తమ దుఃఖాన్ని దిగమింగుతూ "ఓ అబ్దుల్లా పుత్ర రత్నమా! ఓ అబ్దుల్ ముత్తలిబ్‌గారాల కుమారా! ఖురైష్ వంశ జ్యోతి రత్నమా, కాబా వాసులందరినీ కష్టాల్లో ఆదుకొన్నవాడా, ఖైదీలకు ఆహార పానీయాల్ని అందించిన వాడా, మాకో మేలు

చెయ్యి. మేము నీ వద్దకు రావడానికి కారణమేమంటే మా పిల్ల వాణ్ణి బానిసత్వం నుండి విముక్తి కలిగించు. అందుకు ప్రతి ఫలంగా నీవు ఏ మేరకు ధనమాశించినా, దాన్ని మేమివ్వటానికి సిద్ధంగా ఉన్నాము"ని అన్నారు.

హారిస్ మాటలు విని ప్రవక్త (సఅసం) "ఏ పిల్లవాణ్ణి గురించి మీరు మాట్లాడుతున్నార"ని అడిగారు. "జైద్ గురించే" అని హారిస్ అన్నాడు. ఈ మాటలు విని ప్రవక్త (సఅసం) కొంతసేపు మౌనం వహించారు. నిజానికి జైద్ అంటే ప్రవక్త (సఅసం)కు ఎంతో వాత్సల్యం ఏర్పడింది. ఆయన జైద్‌ను తన సొంత కుమారునిగా చూడ సాగారు. మరియు జైద్ (రజి) కూడా ప్రవక్త (సఅసం)కు మిక్కిలి విధేయులుగా మెలుగుతూ ఉండేవారు. ఇటువంటి పరిస్థితిలో హారిస్ తన కుమారుణ్ణి వాపసు తీసుకు వెళ్తానంటే ఆయన (సఅసం)కు బాధకలిగింది. ప్రవక్త (సఅసం) జైద్ (రజి)ను చూడకుండా ఒక్క క్షణం కూడా వుండలేకపోయేవారు. ఆయన (సఅసం) హారిస్‌తో "మీరు అతన్ని తప్ప వేరేదేమైనా కోరు కుంటారా" అని అన్నారు. "లేదు" అని హారిస్ సమాధాన మిచ్చాడు. "మంచిది, జైద్‌ను పిలవండి, మీతో వస్తానంటే సంతోషంగా తీసుకు వెళ్ళండి. ఒక వేళ నాతోనే ఉండాలనుకుంటే, దైవం సాక్షి! నన్ను వదలి పోనివారిని బలవంతంగా వదలించుకోవడానికి ఇష్టపడే వాణ్ణి కాను నేను" అని ఆయన (సఅసం) సెలవిచ్చారు

హారిస్ మరియు అతని సోదరుడు కఅబ్ ప్రవక్త (స) పెట్టిన షరతును అంగీకరించారు. బహు కాలంగా తమ కుమా

మకు బానిసత్వపు బంధంలో పడివున్నాడు. ఇప్పుడు పిలిచిన వెంటనే వచ్చేస్తాడనుకున్నారు.

జైద్ (రజి)ను పిలిపించి ప్రవక్త (సఅసం) "నీవు వీరిద్ద రినీ ఎరుగుదువా" అని ప్రశ్నించారు. "అవును హారిస్ నా తండ్రి, మరియు కఅబ్ నా బాబాయి" అని జైద్ సమాధాన మిచ్చారు మళ్ళీ ప్రవక్త (సఅసం)" నీవు నన్ను కూడా గుర్తు పట్టగలవు, నీవు వీరితో నీ స్వగృహానికయినా వెళ్ళగలవు, లేదా నాతోటే ఉండగలవు. ఏదయినా నీ యిష్టమే" అని పలికారు. అందుకు జైద్ (రజి) "నేను మిమ్మల్ని వదిలేసి వెళ్ళేవాణ్ణి కాను. మీరే నా తండ్రి మరియు తల్లి" అని సమాధాన మిచ్చారు.

కుమారుని ఈ మాటలు విని తండ్రి మరియు బాబాయి నిశ్చేష్టులై పోయారు. మరియు వారు "బాబా ఇది ఎంతో శోచ నీయమయిన విషయం. నీవు బానిసత్వాన్నుండి విముక్తి పొంద బోతున్నావనుకుంటే, మరల దాన్నే కోరుకుంటున్నావు. నీవు నీ తండ్రి, బాబాయి మరియు వంశానికే ప్రేమ పాత్రుడవు. అటు వంటిది కాదని నీవు మమ్మల్నందర్నీ వదలివేస్తున్నావా? స్వస్థలా నికి వెళ్ళడానికి నీకు ఇష్టంగా లేదా?" అని అన్నారు.

అందుకు సమాధానంగా "అవును ఈ మంచి మనిషిలో ఎన్ని మంచి గుణాలు కనిపించాయి! మీ అందరినీ వదిలేసి ఉండగలను కాని, ఈ ప్రేమ మూర్తిని విడిచిపెట్టి నేనుండలే" నని జైద్ (రజి) అన్నారు

ఈ మాటలు విని ప్రవక్త (సఅసం) జైద్ (రజి) చేయిపట్టి కాబావైపు నడిచారు. జైద్ (రజి) తండ్రి మరియు బాబాయి

కూడా ఏమి జరుగుతుందో చూడాలని వారి వెంటే నడిచారు కాబాలో కెళ్ళి ప్రవక్త (సఅసం) పెద్ద గొంతుతో "ఓ జను లారా! మీరే సాక్షులుగా ఉండండి. ఈ రోజు నుండి జైద్ నా కుమారుడు. అతను నా వారసుడు. నేను అతని వారసుణ్ణి" అన్నారు.

ఈ ప్రకటనను విన్న జైద్ (రజి) తండ్రి మరియు బాబాయి సంతోషించారు. జైద్ (రజి)కు ఇక్కడ లభించే మనశ్శాంతి, ప్రశాంతత మరెక్కడా లభించదని వారు సమాధాన పడ్డారు. సంతోషంతో ఇరువురూ యమన్ వెళ్ళి ఇంటి వారితో జైద్ చాలా సుఖంగా వున్నాడు, ముున్ముందు ఆయన గొప్ప మనిషి కాబో తున్నాడని ఊరట కల్గించారు.

వాస్తవానికి యుక్తవయస్సుకు చేరుకున్న తరువాత జైద్ (రజి) ఎంతో గొప్పవారయ్యారు. ప్రవక్త (సఅసం) గొప్ప అను చరులు సైతం జైద్ (రజి) వృద్ధి వికాసాలపట్ల ఈర్ష్యపడేవారు. ఆయన (రజి) ప్రవక్త (సఅసం)కు అంతరంగికులుగా కూడా మెలిగేవారు. ప్రవక్త (సఅసం) తన స్వంత మేనత్త కూతుర్నే ఇప్పించి వివాహం జరిపించారు. ఎప్పుడైనా సైన్యాన్ని ఎటైనా పంపినపుడు అందులో జైద్ (రజి) కూడా ఉన్నట్లయితే వారినే ప్రవక్త (సఅసం) సైన్యాధిపతిగా నియమించేవారు. ఇలాంటి ఓ సందర్భంలో అబూబక్ర్ సిద్దీఖ్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి), అబూ ఉబైదా (రజి) మరియు ఎంతో మంది ఇలాంటి గొప్ప అనుచరులు సైతం అందులో ఉన్నా ప్రవక్త (సఅసం) జైద్ (రజి) నే దానికి నాయకునిగా చేశారు. ఇంతకంటే ఉన్నత స్థానం ఇంకేది కాగలదు. జైద్ (రజి) పట్ల దేవుడు ప్రసన్ను

డయ్యాడు. ప్రవక్త (సఅసం) మరియు ముస్లిం ప్రజలు ఎంతో సంతోషాన్ని తెలియజేశారు. ఆయన (రజి) చివరికి అమరగతిని పొందారు.

—(o)—

# హజ్రత్ జుబైర్ [రజి] బాల్యం

'వీరు స్వర్గ నివాసులు' అని దైవ ప్రవక్త (సఅసం) ప్రకటించిన పది మంది సహచరుల్లో హజ్రత్ జుబైర్ (రజి) ఒకరు. వీరి బాల్యదశ వివరాలు వినడానికి చాలా ఆసక్తికరంగా ఉంటాయి. జుబైర్ (రజి) తండ్రి మరణించిన తరువాత, వీరి తల్లి హజ్రత్ సఫియా (ర.అన్హా) వీరిని పెంచి పెద్ద చేశారు. హజ్రత్ సఫియా (ర అన్హా) ప్రియ ప్రవక్త (సఅసం) వారి మేనత్త, హజ్రత్ హమ్జా (రజి)కు తోబుట్టువు. సఫియా (రజి అన్హ)ఎంతో ధీరవనిత. తన కుమారుడు కూడా శూరుడు, ధీరుడు, మరియు జ్ఞాని కావాలనే ఆమె కోరుకునే వారు. జుబైర్ (రజి) చేత ఆమె కష్టతరమయిన పనులు చేయించేవారు. ఒక్క క్షణం కూడా ఆయన్ని వృధాగా ఉండ నిచ్చేవారు కాదు. తన ఒక్కగానొక కుమారుణ్ణి కష్టమయిన పనులు చేయించడం చూచి ప్రజలు

"ఏ మమ్మా! పిల్లవాణ్ణి బ్రతుకనివ్వవా"? అని ఆమెతో అడిగేవారు. "నేను అతన్ని బుద్ధి మంతుడు, ధైర్యవంతుడు, పరాక్రమశాలిగా తయారు జేయబోతున్నాన"ని సఫియా (రజి అన్హ) సమాధాన మిచ్చేవారు.

అలాగే ఆయన (రజి) బాల్యంనుండే ధైర్యస్థయిర్యాలు కలవారయ్యారు. ఆయనింకా యవ్వన దశకు చేరకముందే ఒక మల్లయుద్ధ వీరునితో భేటీ అయింది. తన చేతి వ్రేటుకు ఆ పహిల్వాన్ క్రిందపడిపోగా చేయి విరిగిపోయింది. ప్రజలు ఆ మల్లవీరుణ్ణి తమ కాళ్ళతో తంతూ హజ్రత్ సఫియా (రజి అన్హ) వద్దకు తీసుకెళ్ళారు. ఆయన పరిస్థితిని గమనించి ఆమె (రజి అన్హ) "నిజంచెప్పు, నా కొడుకు వీరుడా? పిరికి వాడా? నీ అభిప్రాయ మేమిటి?" అని అడిగారు.

హజ్రత్ జుబైర్ (రజి) యుక్తవయస్సులోనే ముస్లిం అయ్యారు. ప్రవక్త (సఅసం) పట్ల ఆయనకు ఎనలేని ప్రేమ. ఒక రోజు అవిశ్వాసులు ప్రవక్త (సఅసం)ను బంధించారని విని జుబైర్ (రజి) కోపంతో కుతకుతలాడుతూ కత్తి ఝుళిపించి ప్రవక్త (సఅసం)కై వెతకనారంభించారు. ఆయన (సఅసం) ఇంటి వద్ద కలిశారు. చేతిలో కరవాలాన్ని గమనించి ప్రవక్త (సఅసం) ఎందుకని ఇలా కోపంగా వున్నావ'ని అడిగారు. "అవిశ్వాసులు మిమ్మల్ని బంధించారని విని, మిమ్మల్ని విడిపించడానికై బయలుదేరాన"ని జుబైర్ సమాధాన మిచ్చారు.

అంత చిన్న వయస్సులోనే ఆయన శౌర్య గుణం తనపై ఆ ప్రేమను గమనించిన ప్రవక్త (సఅసం) ఎంతో సంతోషించారు. దైవప్రవక్త (సఅసం)కు సహాయపడడానికై కత్తిని ఝుళిపించిన

పేటల్లో హజ్రత్ జుబైర్ (రజి) మొట్ట మొదట వారని చరిత్ర పుస్తకాల్లో వ్రాయబడివుంది.

—)০(—

# బీబీ ఫాతిమా [రజి. అన్హా] బాల్యం

హజ్రత్ ఫాతిమా (రజి అన్హ) ప్రియ ప్రవక్త (సఅసం) కు ప్రియమైన పుత్రిక. స్త్రీ లోకంలో హజ్రత్ ఫాతిమా (రజి అన్హ) స్థానం ఎంతో ఉన్నతమయింది. ప్రపంచ స్త్రీ లందరిపై ఐదుగురు స్త్రీలు ఆధిక్యత కలవారని ప్రవక్త (సఅసం) ప్రకటించారు. ఆ ఐదుగురిలో ఫాతిమా (రజి అన్హ) కూడా ఒకరు.

హజ్రత్ బీబీ ఫాతిమా (రజి అన్హ) ఇస్లాం మూసలో పోతపోయబడిన వారు, బాల్యంనుండే ఆమె సహజంగా అణకువ, ఆదరణలతో మెలిగేవారు. ప్రియమయిన తండ్రి (సఅసం) మరియు తల్లి పట్ల ఎంతో సేవా భావంతో మెలిగేవారు. తల్లిదండ్రుల ఎదుట ఎక్కువగా మాటాడక అణకువతో ఉండడమే కాకుండా వారికి వెన్ను చూపించి కూడా కూర్చునేవారు

కారు. ఎల్లవేళలా తల్లి దండ్రుల సేవ చేయడానికి సిద్ధంగా వుండే వారు. గొప్ప విషయమేమంటే బాల్యంనుండే ఆమె [రజి అన్హ] ఎంతో ధైర్య శౌర్యాలు కలవారు. వీరి బాల్యంలో జరిగిన ఓ సంఘటన విశేష ప్రచారంలో ఉంది.

దైవాజ్ఞతో ప్రవక్త [సఅసం] మక్కాలో ఇస్లాం ధర్మ ప్రచారం చేస్తున్న రోజులవి. ఇస్లాం పట్ల మక్కావాసులకు ఇష్టం లేక పోగా శత్రుత్వం వహించారు. వారు అనేక విధాలుగా ప్రవక్త ధర్మ ప్రచారాన్ని ఆటంకపరిచేవారు.

ఇలాంటి పరిస్థితుల్లో ఒక రోజు ప్రవక్త (సఅసం) కాబాలో నమాజ్ చేస్తున్నారు. అవిశ్వాసులు దౌర్జన్యంతో ఒంటె ప్రేవులు తెచ్చి ఆయన (సఅసం) మెడపైవేశారు. ఆ బరువుతో ఆయన లేవలేక పోయారు. ఇది చూసి అవిశ్వాసులు పరిహాస మాడసాగారు. ఈ విషయాన్ని ఎవరో వెళ్ళి బీబీ ఫాతిమా (రజి అన్హా)తో చెప్పారు. ఆ సమయంలో ఫాతిమా (రజి అన్హా) వయస్సు ఐదు లేక ఆరు సంవత్సరాల కంటే ఎక్కువలేదు అయినా ఈ వార్త విన్న వెంటనే ఆమె పరుగు తీసుకుంటూ వచ్చి తండ్రి మెడలపైవున్న ప్రేవుల్ని తొలగించారు. ఆ తరువాత అవిశ్వాసుల్ని శపిస్తూ హెచ్చరించారు.

—(o)—

# హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) బాల్యం

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి) ప్రవక్త [సఅసం కాలంలోవున్న ఓ యువకులు. అయినా వారు గొప్ప అనుచర వర్గంలోనే పరిగణింపబడేవారు. యుక్తవయస్సుకు చేరిన తరువాత వారు గొప్ప హదీసు స్మర్తగా ఎంచబడేవారు. ప్రియ ప్రవక్త [సఅసం]కు సేవచేయటంలో వీరికి అగ్రగామిగా పేరు. ఇంకా ఎన్నో విషయాల్లో వీరు ఘనత వహించారు. ఆ కాలంలో ఆయన (రజి) ఎంత గొప్పవారుగా ఎంచబడేవారంటే హజ్రత్ ఉమర్ (రజి) తరువాత వీరినే ఖలీఫాగా ఎన్నుకోవాలని ప్రజలు తలచేవారు. అయితే హజ్రత్ ఉమర్ [రజి] తన కుమారునిపై ఇలాంటి కార్య నిర్వహణా భారాన్ని మోపవద్దని అభ్యర్థించాడు. ఇటువంటి సజ్జనుని బాల్యంలో జరిగిన కొన్ని సంఘటనల వివరాలు చరిత్ర పుస్తకాలనుండి తెలుసుకుందాం.

ప్రవక్త మహనీయులంటే (సఅసం) హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ [రజి]కు ఎంతో గౌరవ భావముండేది. ప్రతి విషయంలో ఆయన్ని అనుకరించేవారు, దైవ మార్గంలో తన ప్రాణాల్ని

బలిళు ఇవ్వాలనే ఆలోచన వీరికి చిన్నప్పటినుండే ఉండేది ప్రసిద్ధ బద్ర్ యుద్ధం ముస్లింలు మరియు అవిశ్వాసులకు మధ్య జరిగింది. అప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ [రజి] వయస్సు పదమూడు సంవత్సరాలు. అయినప్పటికీ ఆయుధం ధరించి యుద్ధమైదానంలోవున్న సైన్యం వద్దకుచేరి, 'నేను కూడా ప్రవక్త (సఅసం)కు సహాయంగావుండి అవిశ్వాసుల్తో పోరాడ తాన'ని అన్నారు. ఈ బాలయోధుణ్ణి చూసిన ప్రవక్త (సఅసం) సంతోషించి ఎన్నో విధాల నచ్చజెప్పి వాపసు పంపారు. ఉహద్ యుద్ధ సమయంలో వీరి వయస్సు 14 సంవత్సరాలు. అందు లోనూ పోరాడే యోధునిగా వెళ్ళి చేరారు. కాని మరల ప్రవక్త (సఅసం) 'నీవు ఇంకా చిన్న వయస్సువాడివే' అనిజెప్పి త్రిప్పి పంపారు. చివరికి 'అగడ్త' యుద్ధంలో పోరాడే అవకాశం లభిం చింది. ఆ సమయంలో వీరి ధైర్యాన్ని మరియు శూరత్వాన్ని గమనించిన ప్రవక్త [సఅసం] మిక్కిలి సంతోషించారు.

ధైర్యస్థయిర్యాలకు తోడుగా వీరికి దైవం బాల్యంనుండే జ్ఞానాన్ని కూడా ప్రసాదించాడు. వీరి జ్ఞాపకశక్తి ఎంత గొప్ప దంటే ఏ విషయాన్నాయినా లోతుగా పరిశీలించి పసిగట్టగలిగే వారు. ఒక సారి ప్రవక్త [సఅసం] చెంత కూర్చునివున్నారు. వారితో పాటు గొప్ప అనుచరులు (రజి) కూడా సమావేశమయి వున్నారు. ప్రవక్త (సఅసం) అనుచరుల్ని ఉద్దేశించి, "ఓ ముస్లింలాగానే ఎల్లవేళలా పచ్చగా కళకళలాడుతూ, ఆకులు రాల్చకుండా నిత్యం పండ్లను ప్రసాదించే వృక్షం ఏది" అని ప్రశ్నించారు.

ప్రవక్త (సఅసం) ప్రశ్నను విన్న అనుచరులంతా మౌనం వహించారు హజ్రత్ అబూబక్ర (రజి) మరియు హజ్రత్ ఉమర్ [రజి] సైతం సమాధానం చెప్పలేక మౌనంగావున్నారు. అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి), ప్రశ్నకు సమాధానాన్ని గ్రహించి. చెప్పాలని అనేకసార్లు ప్రయత్నించారు. కాని అంతమంది పెద్దలున్న సభలో వారే సమాధానం చెప్పలేకుండా ఉన్నప్పుడు చిన్న వయస్సు గల తనకు సమాధానం తెలిసినా మౌనంగా ఉండటమే ఉత్తమమని భావించారు.

ఇంటికి వెళ్ళిన తరువాత తండ్రితో, "ఆ వృక్షం ఖర్జూరపు చెట్టనే సమాధానం తనకు తోచిందని, పెద్దల పట్ల గౌరవ భావంతో దాన్ని అచ్చట చెప్పలేకపోయాన"ని విన్నవించారు. అందుకు ఉమర్ [రజి] "నాయనా, ఈ విషయాన్ని నీవు అక్కడే చెప్పి వుంటే నేనెంత సంతోషించివుండేవాణ్ణి ఇంత కంటే నేను వేరే కోరేదేముంది" అని అన్నారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ [రజి] బాల్యంలోవున్నప్పుడు జరిగిన సంఘటనల్లో ఇదేమనకు తెలిసింది. వారు పెద్ద వారయ్యాక జరిగిన మరెన్నో గొప్ప విషయాలు చరిత్ర పుస్తకాల్లో ఉన్నాయి. ఏది ఏమయినా హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ [రజి], పెద్ద వారయ్యాక నిజంగా గొప్పవారౌతారనుకున్నారు, అలాగే అయ్యారు.

—)o(—

# హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) బాల్యం

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ప్రియ ప్రవక్త [సఅసం] బాబాయి కుమారుడు. వీరు పుట్టిన తరువాత హజ్రత్ అబ్బాస్ [రజి] వీరిని దైవ ప్రవక్త [సఅసం] వద్దకు తీసుకెళ్ళగా ఆయన [సఅసం] తన ఉమ్మిని నాకించారు, ఆశీర్వదించారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ బాల్యంనుండే మంచివాడు. ఎంతో తెలివిగలవారు, మరియు సూక్ష్మగ్రాహి కూడా. వీరికి ప్రతి విషయాన్ని తెలుసుకోవాలనే ఆసక్తి ఉండేది. ఒకరోజు ప్రియ ప్రవక్త [సఅసం] వద్దకు వెళ్ళారు. అక్కడనుండి పరుగుతో ఇంటికి వచ్చి తండ్రి అబ్బాస్ [రజి] తో "నేను ఈ రోజు ప్రవక్త [సఅసం] వద్ద ఓ మనిషిని చూశాను. ఆయన్ని నేనెరుగను ఆయనెవరో నాకు తెలిసివుంటే ఎంత బాగుండేదో" అని అన్నారు.

జిబ్రీల్ [అ] అయివుంటారనే ఆలోచన అబ్బాస్ [రజి]కు కలిగింది. ఈ విషయాన్ని ప్రవక్త [సఅసం]తో విన్నవించగా ఆయన [సఅసం] ప్రేమతో నిండిన చూపులతో అబ్దుల్లా వంక

చూసి అయన్ని తన ఒడిలో కూర్చోబెట్టుకున్నారు. ఆయన [సఅసం] పిల్లవాడి తల నిమురుతూ "ఓ అల్లాహ్! ఈ పిల్లవాని పై నీ కారుణ్యాన్ని కురిపించు, ఇతని ద్వారా నీ ధర్మ జ్ఞాన జ్యోతిని వ్యాపింపజేయి" అని దీవించారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) అంటే దైవ ప్రవక్త [సఅసం]కు ఎంతో ప్రేమ. అబ్దుల్లా [రజి] ప్రవక్త [సఅసం]తో ఎంతో కలివిడిగా ఉండేవారు ప్రవక్తగారి చిన్న చిన్న పనులు వారేచేస్తుండేవారు. ఒకసారి అబ్దుల్లా (రజి] ఆడుకొంటున్న సమయంలో ప్రవక్త [సఅసం] అటుగుండా వెళ్తున్నారు. వారిని చూసిన అబ్దుల్లా ఓ చోట దాగి ముసి ముసి నవ్వులు నవ్వుకోసాగారు. అది గమనించిన దైవ సందేశహరులు అబ్దుల్లా వద్దకు వెళ్ళి, తల నిమురుతూ "వెళ్ళి మాఆవియా [రజిను] పిలుచుకు రమ్మ"ని చెప్పారు. [హజ్రత్ మాఆవియా (రజి) ప్రవక్త (సఅసం) వద్ద లేఖకునిగా వుండేవారు). అబ్దుల్లా (రజి) పరుగు తీసుకుంటూ వెళ్ళి మాఆవియా (రజి)తో "పదండి మీతో చాలా అవసరమేర్పడి, మిమ్మల్ని ప్రవక్త (సఅసం) పిలుచుకు రమ్మనార"ని చెప్పారు.

ప్రవక్త [సఅసం] ఇంటి వద్ద ఏం చేస్తారో తెలుసుకోవాలని హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్[రజి]కు కుతూహలంగా వుండేది. ఈ విషయం తెలుసుకోవాలంటే అబ్దుల్లా [రజి]కు అడ్డంకులు కూడా ఎమీ లేవు. మొదటి విషయమేమంటే వారు దైవసందేశహరుని చిట్టి పొట్టి సోదరులు [పినతండ్రి కొడుకు]. ఉమ్ముల్

మోమినీన్ హజ్రత్ మైమోనా* [రజి అన్హా]కు మేనల్లుడు. ఈ దగ్గరి బంధుత్వం కారణంగా అబ్దుల్లా [రజి] ప్రవక్త [సఅసం] ఇంట్లోకి నిరాటంకంగా వెళ్ళేవారు. ఉమ్ముల్ మోమినీన్ [ర. అన్హా] కూడా అబ్దుల్లా [రజి]నూ ఎంతో ప్రేమించేవారు. సాధారణంగా రాత్రి సమయాల్లో ఈ పిన తల్లి ఇంట్లోనే విశ్రమించే వారు.

ఒకరోజు రాత్రి హజ్రత్ అబ్దుల్లా పినతల్లి ఇంట్లో ఉంటగా ఇంకా నిద్ర పోలేదు. ప్రవక్త మహనీయుల [సఅసం]కు వుజూ చేయాలనిపించింది. ఆయన ఇటూ అటూ చూశారు. ఇది గమనించిన హజ్రత్ అబ్దుల్లా [రజి] వెంటనే విషయం తెలుసుకున్నారు. చప్పుడు చెయ్యకుండా వెళ్ళి వుజూ కొరకు నీళ్ళు తెచ్చి పెట్టి పడుకున్నారు. దైవసందేశహరులు వుజూ చేసి "నీరు ఎవరు తీసుకువచ్చార"ని అడిగారు. నీటిని ఎవరు తీసుకువచ్చారో హజ్రత్ మైమూనా [రజి అన్హా] చెప్పారు. అందుకు దైవప్రవక్త సంతోషించి "ఓ అల్లాహ్ ఈ పిల్లవానికి నీ ధర్మజ్ఞాన జ్యోతిని ప్రసాదించు. ప్రతి విషయంలో దాగి వున్న అంతరార్థాన్ని గ్రహించే శక్తిని ఇవ్వు" అని ప్రార్థించారు.

మరో రోజు రాత్రి దైవప్రవక్త [సఅసం] జాగరణ చేశారు. ఆయన వుజూ చేసి నమాజ్ చేయడానికి నిల్చున్నారు. నిద్ర పోతున్న అబ్దుల్లా (రజి) మెలుకువ వచ్చి లేచారు. వారూ వుజూ చేసి నమాజ్కై ప్రవక్త (సఅసం)కు ఎడమ వైపుకు నిల్చున్నారు. ఇది గమనించి దైవప్రవక్త (సఅసం) అబ్దుల్లా తలపట్టి తన కుడి

---

* **ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ మైమూనా (రజి అన్హా) మరియు అబ్దుల్లా (రజి) తల్లి హజ్రత్ ఉమ్ముల్ ఫజ్ల్ అక్కాచెల్లెండ్లు.**

వైపుకు మరల్చారు. ఇదే విధంగా మరోసారి అబ్దుల్లా (రజి) నమాజ్‌కై ప్రవక్త (సఅసం) వెనుక నిల్చున్నారు. అప్పుడు కూడ ఆయన (సఅసం) వారి (రజి) చేయి పట్టి తనతో పాటు నిల్చోబెట్టుకున్నారు. ప్రవక్త (సఅసం)తో పాటు ప్రక్కన నిల్చున్న అబ్దుల్లా (రజి) గాభరాపడి నిశ్చేష్టులై నిల్చునే ఉండి పోయారు. నమాజ్ ముగిసిన తరువాత దైవ ప్రవక్త (సఅసం) "ఏమిటి నీ పరిస్థితి" అని అడిగారు. అందుకు అబ్దుల్లా (రజి) "ఓ దైవ ప్రవక్తా! మీతో సమానంగా నిల్చోవడం ఎవరికైనా భావ్యమేనా? మీరైతే దేవుని ప్రవక్త' అని అన్నారు. అబ్దుల్లా సంస్కారానికి గౌరవభావానికి, బుద్ధికుశలతకు ప్రవక్త (సఅసం) సంతసించి అబ్దుల్లా (రజి)ను దీవించారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజి) ప్రవక్త (సఅసం)తో ఎంత కలివిడిగా ఉండేవారంటే అనుక్షణం వారినే అంటిపెట్టుకొని వుండడానికి ప్రయత్నించేవారు. ప్రవక్త (సఅసం) తన సహచరుల (రజి)తో కలసి కూర్చున్నప్పుడు అబ్దుల్లా (రజి) రాగా ఆయన (సఅసం) వారిని తన చెంత కూర్చోబెట్టుకునేవారు.

ఒకసారి అబ్దుల్లా (రజి) ప్రవక్త (సఅసం) కుడి వైపు కూర్చుని ఉన్నారు. అంతలో ఎవరో పాలు తీసుకొచ్చి ఇచ్చారు గిన్నెలో ప్రవక్త (సఅసం) రెండు మూడు గ్రుక్కలు పాలు త్రాగారు. ఎల్లప్పుడూ ఆయన (సఅసం) ప్రతి పనినీ కుడి వైపు నుంచే మొదలుపెట్టేవారు. అలాగే పాలు త్రాగి ప్రవక్త (సఅసం) తన కుడి వైపు చూడగా అబ్దుల్లా (రజి) కూర్చొని ఉన్నారు.

"ఓ కుమారా! వాస్తవానికి నా తరువాత వంతు నీదేను.

కాని, నీ కంటే పెద్దవారైన అనుచరులు (రజి) న్నారు కదా, ఈ పాలను మరి వారికిచ్చేదా?'' అని అడిగారు.

దైవ ప్రవక్త (సఅసం) ఈ విధంగా అంటున్నప్పుడు ఆయన [సఅసం] ఏ చోటైతే తన పెదవులానించి పాలు త్రాగారో ఆ స్థానాన్నే అబ్దుల్లా (రజి) తదేకంగా చూస్తున్నారు. అబ్దుల్లా (రజి) ''ఓ దైవప్రవక్తా ! నేను వేరే ఎంతటి పెద్ద త్యాగం చేయ మన్నా చేయగలను కాని ఏ స్థానాన్నయితే మీ పవిత్ర పెదవులు తాకాయో, అదే స్థానాన్ని అందరికంటే ముందు నా పెదవులతో తాకాలి" అని అన్నారు.

ప్రవక్త (సఅసం) చిరునవ్వుతో పాల గిన్నెను అబ్దుల్లా (రజి)కు అందించారు. ప్రవక్త (సఅసం) ఏ చోటైతే తన నోటిని పెట్టి పాలు సేవించారో అదే చోటి నుండే అబ్దుల్లా పాలను త్రాగారు తరువాత దాన్ని మిగతా వారికిచ్చారు.

ఈ విధంగా ప్రవక్త [సఅసం] చెంత హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్[రజి] బాల్యం గడిచిపోయింది, ఆ సమయంలో వారు చాలా విషయాలు తెలుసుకునే ఉంటారు. ఎన్నోసార్లు ప్రవక్త [సఅసం]ఆయన్ని గురించి దుఆ చేశారు. ఎంత మంచి అదృష్టం వారిది!దాని ఫలితంగానే ప్రజలు ఆయన్ని చిన్న వయస్సునుండే 'జ్ఞాని' అని పిలిచే వారు. ఇంకా ఒక్కో విషయంలో ప్రవక్త [సఅసం] ఏ విధంగా ఆచరించే వారని ప్రజలు అబ్దుల్లా [రజి]ను అడిగి తెలుసుకునేవారు.

హజ్రత్ అబ్దుల్లా [రజి]కు 13 సంవత్సరాల వయస్సు వచ్చిన సమయంలో ప్రవక్త [సఅసం] పరమపదించారు. వారు చిన్న వయస్సులోనే ఎన్నో విషయాలు తెలుసుకుని కంఠస్థం

చేసిన ఫలితంగానే హజ్రత్ ఉమర్ [రజి] వారిని గొప్ప గొప్ప ప్రవక్త సహచరులు కూడిన సభల్లో కూర్చోవడానికి అనుమతించే వారు. అక్కడ ధర్మ సంబంధమయిన విషయాల గోష్ఠిలో మాట్లాడే అవకాశాన్నిచ్చేవారు.

ఒకసారి హజ్రత్ ఉమర్ (రజి) విద్వాంసులు, పండితులు అయిన సహచరుల సభలో కూర్చొని ఉన్నారు. ఆ సభలో హజ్రత్ అబ్దుల్లా (రజి) కూడా ఉన్నారు. సభలోని వారిని ఉద్దేశించి హజ్రత్ ఉమర్ [రజి] 'నస్ర్' సూరా [ఇజాజా నసురుల్లాహి వల్ ఫత్హ్*........చివరి వరకు]చదివి ''మీ అభిప్రాయాన్నను సరించి దీని అర్థం ఏమిట"ని ప్రశ్నించారు. పెద్దలంతా తమ తమ అభిప్రాయాల్ని వెలిబుచ్చారు. ఆ తరువాత అబ్దుల్లా [రజి]ను అడిగారు. సమాధానంగా వారు "ఈ సూరాలో దైవ ప్రవక్త(సఅసం)మరణ విషయం ప్రస్తావించబడింద"ని అన్నారు. సంతోషంతో ఉన్నపళంగా లేచి హజ్రత్ ఉమర్ (రజి) అబుల్లా [రజి]ను శెహబాష్! అని మెచ్చుకున్నారు. తను కూడా ఈ అభిప్రాయంతోనే ఏకీభవిస్తున్నానని తెలిపారు.

ఎంతో వృద్ధులయిన సహచరుల (రజి)తో అబుల్లా (రజి) కూర్చుని ఉండటం చూచి కొంత మంది తమ అయిష్టతను తెలియజేసేవారు. అంత చిన్న వయస్సుగల పిల్లవాణ్ణి పెద్దలతో సమానంగా కూర్చోబెట్టడం భావ్యం కాదని పలికేవారు. అందుకు హజ్రత్ ఉమర్ (రజి) ''ఈ పిల్లవాని తెలివితేటల ప్రభావం

---

* **దేవుని సహాయం, విజయం ప్రాప్తమైనప్పుడు.... ఓ ప్రవక్తా దేవుని మన్నింపును, క్షమాపణను అర్థించండి.**

మీ హృదయాల్లో నాటుకుపోయింది. ఈ విషయం మీ అందరికీ తెలుసు'' అని సమాధానమిచ్చేవారు.

గమనించవలసిన విషయమేమంటే దైవం తన కారుణ్యంతో బాల్యంలోనే ఈ పిల్లవానికి ఎంతో జ్ఞానాన్ని ప్రసాదించాడు. పెద్దవారయ్యాక ఆయన ఎంతటి మేధావి అయ్యారో! ఆయనకు ఖుర్ఆన్, హదీసు, ఫికహ్ (ధర్మాన్వయం) సాహిత్యం, కవిత్వంలో సాటిలేని జ్ఞానం, ప్రావీణ్యత వుండేదని పుస్తకాల్లో వ్రాయబడివుంది. ఆనాటి ప్రముఖ విద్వాంసులు, పండితులు అయిన హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజి) కూడా వీరి అపార మేధాసంపత్తిని గుర్తించి ఒప్పుకునేవారు. ఇంకా వారే "అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజి)ఎంత ఉత్తమ ఖుర్ఆన్ వ్యాఖ్యాత" అంటే "ఖుర్ఆన్‌ని చక్కగా అర్థమయ్యేట్లు చెప్పేవాడు" అని అనే వారు.

పుస్తకాల్లో వ్రాయబడిన వీరి ఎన్నో విషయాలు మనకు ఈనాటికీ లభిస్తాయి. ఆ విషయాల ద్వారా ఆయన (రజి) ఎంత గొప్పవారనేది మనకు తెలుస్తుంది. మనం కేవలం వారి బాల్య విషయాలు మాత్రమే తెలుసుకున్నాం. అంత చిన్న వయస్సులోనే వారి తెలివితేటలు ఇలా వుంటే పెద్దవారయ్యాక ఆయన ఎంతటి గొప్ప మేధావి అయ్యారో కదా!

ఒకసారి అబ్దుల్లా(రజి)ని ఒక వ్యవహారంపై ఆఫ్రికా రాజు జర్జీర్‌షా వద్దకు పంపడం జరిగింది. ఆ రాజు వీరిని చూసి ముస్లింల ఖలీఫా ఇంత చిన్న వయస్సుగల పిల్లవాణ్ణి పంపాడేమిటని నవ్వుకున్నాడు. వ్యవహారంలో మాట్లాడటం మొదలయ్యాక

ఆ రాజు నిశ్చేష్టుడై "అరబ్ ప్రపంచంలో అందరికంటే గొప్ప విద్వాంసులు మీరేనని భావిస్తున్నా"నని అన్నాడు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్(రజి) గొప్పతనం స్థూలంగా ఇది! (దైవం వారితో ప్రసన్నుడవు గాక!)

—)o(—

# హసన్ మరియు హుసైన్ (రజి)ల బాల్యం

హజ్రత్ హసన్ మరియు హుసైన్ (దైవం వారితో ప్రసన్నుడగు గాక!) ప్రియప్రవక్త (సఅసం)కు మనుమలు. వీరి తండ్రి పేరు హజ్రత్ అలీ (రజి). తల్లి పేరు బీబీ ఫాతిమా (రజి అన్హా). దైవం ఈ ఇద్దరు సోదరులకు ఎంతో జ్ఞానాన్ని ప్రసాదించాడు. వీరిరువురు ప్రతి పనిని ఎంతో విజ్ఞతతో చేయడమే గాకుండా మాట్లాడే సమయంలో ఎంతో వివేకాన్ని చూపేవారు. తమ కంటే పెద్దవారికి ఏదైనా విషయం చెప్పాలంటే ఎంతో నేర్పుతో చెప్పేవారు. అలాగే ఓ మనో రంజకమయిన విషయాన్ని వినండి :

హజ్రత్ ఇమామె హసన్ (రజి) మరియు హుసైన్ (రజి) బాల్యంలోనే నమాజ్, వుజూ ఇంకా ఇతర ధార్మిక విషయాలు చక్కగా నేర్చుకున్నారు. ఒకసారి వారు వుజూ చేస్తున్న ఓ మనిషిని చూశారు. ఆయన వుజూను సరియైన పద్ధతిలో చేయ లేదు. ఇరువురు సోదరులు ఆయన్ని వుజూ సరిగ్గా చేయటం ఏ విధంగా నేర్పాలా అనే ఆలోచనలో పడ్డారు. చివరికి ఓమంచి ఉపాయాన్ని కనుక్కన్నారు.

ఆ మనిషితో ఇద్దరు సోదరులు: "బాబాయీ! మేమిద్దరం సొంత సోదరులం మాలో ఎవరు మంచి పద్ధతిలో వుజూ చేస్తారో మీరే గమనించండ"ని అన్నారు. అలా చెప్పి ఇద్దరు సోదరులు వుజూ చేయడానికి కూర్చున్నారు. వారి వుజూను గమనించిన ఆ మనిషి, ఇదే వుజూ చేసే సరియైన పద్ధతి అని తెలుసుకొని, ఇద్దరు పిల్లలు చక్కటి ఉపాయంతో తనకు వుజూ నేర్పారని మనసులో తలంచాడు. వారి వివేకం పట్ల సంతోషించి ఆయన "ఎవరినయితే ప్రియ ప్రవక్త (సఅసం), హజ్రత్ అలీ (రజి) మరియు హజ్రత్ ఫాతిమా (రజి అన్హా), ప్రతి ధార్మిక విష యాన్ని తెలిపారో, నేర్పారో వారి గొప్పతనం గురించి ఏమన గలం ?" అనుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇద్దరు బాల్యంలో వున్నప్పుడు ఓ సారి తగాదాపడి తల్లి వద్దకు ఫిర్యాదు తీసుకొని వెళ్ళారు. ఆ పై హజ్రత్ ఫాతిమా (ర.అ.) "హసన్ (రజి) కొట్టాడా లేక హుసైన్ (రజి)నా ? అనేది నా కనవసరం. నేను తెలుసుకున్న విషయమేమంటే దైవం మీరంటే కోపంగా వున్నాడు. ఎందుకంటే తగాదాలు జగడాలు అంటే ఆయన ఇష్టపడడు గనక" అని అన్నారు.

ఇది విని ఇద్దరు అన్నదమ్ములు తలవంచుకొని "అమ్మా. మమ్మల్ని క్షమించండి, ఇంకెప్పుడూ మేము తగాదా పడము" అని అన్నారు.

సమాధానంగా హజ్రత్ ఫాతిమా (రఅ) "క్షమాపణ దైవంతో వేడుకోండి. వెళ్ళి వుజూ చేసి నమాజ్ చేయండి, దైవ ప్రసన్నతను పొందండి" అని అన్నారు.

ఇద్దరు అన్నదమ్ములు వుజూ చేసి నమాజ్‌కై నిల్చుని ఎంతో దీనంగా క్షమాపణకై దైవ సమక్షంలో విలపించసాగారు. ఎంత మంచి సోదరులు వారు! మరియు ఫాతిమా (రఅ) కూడా ఎంతటి సాధ్వీమణి! (దైవం వారందరితో ప్రసన్నుడగు గాక !).

—)o(—

# హజ్రత్ అనస్ (రజి) బాల్యం

ప్రియప్రవక్త (సఅసం) మక్కా నుండి మదీనాకు వలస వచ్చిన కొద్ది రోజుల తరువాత తెలివైన ఓ స్త్రీ వారి వద్దకు వచ్చింది. ఆమె వెంట ఎనిమిదేళ్ళ ఓ బాలుడున్నాడు. ఆ స్త్రీ ప్రవక్త (సఅసం)తో ''ఓ దైవప్రవక్తా! ఇతడు నా కుమారుడు, ఇతనంటే నా కెంతో ప్రేమ. నేను ముస్లిమ్‌ని. నా పిల్లవాడూ నిజమైన మరియు పరిపూర్ణమైన ముస్లిం కావాలని నేను కోరు

కుంటున్నాను ఈ పిల్లవాణ్ణి మీ సేవకై నేను తీసుకువచ్చాను. మీ వద్దే వుండి మీరు వ్యాపింప జేయదల్చుకున్న ధర్మాన్ని నేర్చుకుంటాడ''ని విన్నవించుకుంది.

తెలివైన ఆ స్త్రీ విన్నపాన్ని ప్రవక్త (సఅసం) అంగీకరించి, పిల్లవాణ్ణి తన దగ్గర వుంచుకున్నారు. తల్లి వలెనే పిల్లవాడూ మంచి హుషారైనవాడు. దైవప్రవక్త (సఅసం) చేసే ప్రతి పనినీ, పలికే ప్రతి మాటను శ్రద్ధతో చూస్తూ, వింటూ దాన్ని గుర్తుంచు కుంటాడు. ప్రవక్త (సఅసం) చెప్పే ప్రతి పనిని ఉరుకు, పరుగు లతో చేసి పెట్టాడు. ఎల్లప్పుడూ ప్రవక్త (సఅసం) ఆజ్ఞాపాలనకై సిద్ధంగా వుండి, వారి మాటను చెవి యొగ్గి విని ఎంతో నేర్పుతో వారి పనుల్ని నెరవేర్చేవాడు.

దైవప్రవక్త (సఅసం)కు విధేయుడిగా ఉండడంలో పేరు సంపాదించాడు ఆ పిల్లవాడు. తనతో మంచి చనువుగా, విధే యుడిగా వుండటం మూలానే ఆయన (సఅసం) ఒకసారి ఆ పిల్లవానితో తమాషాగా మాట్లాడారు. ఆయన (సఅసం) ఆ పిల్లవాణ్ణి ఓ రెండు చెవులవాడా అని పిలిచారు. దానికి భావం విధేయత గలవాడని. అయితే ఇది విన్న వారికి ఎంతో హాస్యాన్ని కలుగజేస్తుంది. ఎందుకంటే రెండు చెవులయితే అందరికీ వుంటాయి.

ఏ బాలునితోనయితే ప్రవక్త (సఅసం) ఆ విధంగా హాస్య మాడారో మున్ముందు గొప్ప విద్వాంసుడయ్యాడు. ఆ అదృష్ట వంతుడయిన పిల్లవాని పేరును నేడు మనం ఎంతో వినయంగా "హజ్రత్ అనస్ (రజి) అని పలుకుతున్నాము (దైవం ఆయనతో ప్రసన్నుడవు గాక).

ఒకసారి దైవ ప్రవక్త (సఅసం) అనస్ (రజి)ను ఓ పని మీద ఒక చోటికి పంపారు. అక్కడ ఆయనకు ఆలస్యమయింది. ఈ విషయం తెలిసిన అనస్ (రజి) తల్లి, "అక్కడ ఏమంత పెద్ద పని వున్నదని ఆలస్యమయింద"ని అడిగారు. హజ్రత్ అనస్[రజి] ఇంకా చిన్న వయస్సు వారయినా తానిచ్చిన సమాధానం తల్లికి ఎంతో సంతృప్తి నిచ్చింది. "అమ్మా! దైవసాక్షి! అది ఒక రహస్యమయిన విషయం. ప్రవక్త (సఅసం) విషయాల్ని నేనెవరితో, ఎన్నటికీ చెప్పను. అమ్మా! దీన్ని నీకూ చెప్పను, ఎందుకంటే ప్రియప్రవక్త దీన్ని రహస్యంగా ఉంచమన్నార"న్నదే అనస్ (రజి) తల్లితో పలికిన సమాధానం.

ఇది విని తన తల్లి ఆయన్ని ఎంతో పొగుడుతూ "ఎప్పటికీ చెప్పకు బాబూ! అది ప్రవక్త (సఅసం) రహస్యం" అని అన్నారు.

పెద్దవారయ్యాక హజ్రత్ అనస్ (రజి) ఎంతో గొప్పవారే అయ్యారు. చిన్న వయస్సులో కూడా ఆయన ఎంతో తెలివిగా ప్రవర్తించేవారు. ఆ వయస్సులోనూ ప్రవక్త (సఅసం)ను సంతోషపెట్టగలిగారు. (దైవం వారితో ప్రసన్నుడవు గాక)

—)o(—

# హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) బాల్యం

హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) ప్రియ ప్రవక్త (సఅసం)కు చాలా చిన్న వయస్సుగల సహచరులు. ఈయన ప్రవక్త (సఅసం)కు గొప్ప సహచరులయిన హజ్రత్ జుబైర్ (రజి) గారి సుపుత్రులు. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి)కు మనవడు. ఉమ్ముల్ మోమినీన్* అయిన హజ్రత్ ఆయిషా (రజి అన్హా) అక్క కొడుకు. ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఖదీజా (రఅ) గారి సోదరుని కుమారుడు. సఫియా (రఅ) [ప్రియప్రవక్త (సఅసం) మేనత్త]కు పౌత్రుడు. మరియు హజ్రత్ హమ్జా** (రజి) [ప్రవక్త (సఅసం) గారి బాబాయి]కూడా వీరి పెద్దలలోని వారే హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) గారి పెద్ద కుమార్తె హజ్రత్ అస్మా (రఅ)యే వీరి తల్లి. హజ్రత్ అబ్దుల్లా బిన్

---

* **ఉమ్ముల్ మోమినీన్ అంటే ముస్లింలకు తల్లితో సమానమని అర్థం.**

** **హజ్రత్ హమ్జా [రజి] మరియు హజ్రత్ సఫియా [రజి అన్హా] స్వయంగా అన్నాచెల్లెలు.**

జుబైర్ (రజి) ఇంటి వారికి సంబంధించిన ఈ మూడు విషయాలు, చాలా ప్రసిద్ధి చెందినవి :

1. దైవానికి తప్ప ఇతరులెవరికీ భయపడేవారు కాదు.

2. దైవప్రవక్త (సఅసం)కొరకు ప్రాణత్యాగం చేయడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండేవారు.

3. సత్యం పలకడానికి ఏమాత్రం జంకేవారు కాదు.

ఈ మూడు విషయాలూ హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) పుణికి పుచ్చుకుని పుట్టారు. తన కాలంలో ఆయన అందరికంటే ఎక్కువగా దైవ ప్రార్థన చేసేవారు అందరినీ మించిన ధైర్యస్థైర్యాలు కలవారు మరియు అందరికంటే మంచి ఉపన్యాసకులు. ఆ రోజుల్లో పేరుగాంచిన యోధుడు మొహల్లిబ్‌తో "నేడు అందరికంటే మించిన యోధులు ఎవ"రని ఒకరు అడుగగా, ఆయన ముగ్గురు యోధుల పేర్లను ప్రస్తావించాడు. అయితే అందులో హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ పేరు లేదు. అందుకు "ఏమిటి! అబ్దుల్లా బిన్ జుబైర్ పేరు వారిలో లేదా?" అని ఆశ్చర్యంతో అడుగగా, "తెలివి తక్కువ వాడా! నేను చెప్పింది మానవమాత్రుల విషయం, మృగాల విషయం అడుగుతావేం?" అని ఆ మొహల్లిబ్ సమాధానంగా అన్నాడు.

మొహల్లిబ్ మాటల్ని బట్టి ఆ రోజుల్లో హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి)ను ప్రజలు ఎంతటి ధైర్యశాలి, పరాక్రమశాలి అని తలచేవారో మనకు అర్థమవుతోంది. ఆయన(రజి) ప్రసిద్ధి చెందిన ఖలీఫా యజీద్‌కు ప్రతికూలంగా ప్రభుత్వాన్ని స్థాపించారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) బాల్యం నాటి

పుంచుకున్నారు. అబ్దుల్లా బిన్ జుబైర్ [రజి] హజ్రత్ ఆయిషా ద్వారా ధార్మిక విద్య నేర్చుకున్నారు. దాని ఫలితంగానే హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ [రజి], ధార్మిక విషయాలు సరిగ్గా ప్రవక్త [సఅసం] మాదిరిగానే ఆచరించే వారు. ఆ రోజుల్లో వున్న పెద్ద సహచరులు (రజి) అంతా వీరి ధార్మికతను ఎంతో పొగిడేవారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ [రజి] అంటుండేవారు, "ఓ ప్రజలారా! మీరు దైవప్రవక్త (సఅసం) నమాజ్ చూడాలంటే, ఇబ్నె జుబైర్ (రజి) నమాజ్‌ను అనుసరించండి" అని.

హజ్రత్ అమ్ర్ బిన్ దీనార్ [రహ్మతై] "ఇబ్నె జుబైర్ [రజి] లాంటి నమాజీని నేను చూడలేదు" అని ప్రస్తావించారు. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ [రజి] వారిని "ఎంతో మంచి నమాజీ, ఎంతో ఉత్తమంగా ఉపవాసం పాటించే వ్యక్తి మరియు ఎంతో ఉత్తమ బంధువు" అని అంటూండేవారు. [దైవం వారితో ప్రసన్నుడవుగాక !]

—)o(—

# ఖలీఫా ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ [రహ్మాలై] బాల్యం

ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ [రహ్మాలై] అనే ఓ ప్రసిద్ధి చెందిన ముస్లింల ఖలీఫా ఉండేవారు. వీరు ఎంత మంచి ఖలీఫాగా పేరుగాంచారంటే వీరిని ప్రజలు "ఖుల్ఫాయె రాషిద్"* అనేవారు. ఖలీఫాయె రాషిద్ అర్థమేమంటే ఈ ఖలీఫా సరిగ్గా దైవం మరియు అయన ప్రవక్త [సఅసం] చూపిన మార్గాన్ననుసరించి ఇస్లామీయ ప్రభుత్వాన్ని పరిపాలించారని స్వయంగా తానూ అల్లాహ్ మరియు అయన ప్రవక్త [సఅసం]

---

* ఖుల్ఫాయె రాషెదీన్ అని నలుగురైతే ఉండనే ఉన్నారు :

(1) హజ్రత్ అబూబక్ర సిద్దీఖ్ (రజి)
(2) హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి)
(3) హజ్రత్ ఉస్మాన్ గనీ (రజి)
(4) హజ్రత్ అలీ ముర్తుజా (రజి)

**చాలా మంది ప్రజలు హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్‌లో వున్న మంచి గుణాల్ని చూచి ఐదవ ఖలీఫాయె రాషిద్‌గా పరిగణిస్తారు.**

సంఘటనల్ని తెలుసుకుని మీరూ అలా తయారవడానికి ప్రయత్నించండి

హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) మదీనాలో జన్మించారు. వారి జననాన్ని పురస్కరించుకుని ముస్లిములంతా పండుగ జరుపుకున్నారు. ప్రియప్రవక్త (సఅసం) ఒక ఖర్జూరపుపండును నమిలి జుబైర్ (రజి) నోటిలో వుంచారు. ఈ భూమిపై కాలు పెట్టిన తరువాత ఇదే వారికి లభించిన మొట్టమొదటి అమృతంతో సమానమయిన వరప్రసాదం. ఎంతటి అదృష్టవంతులు హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ [రజి]! వీరి బాల్యంలో జరిగిన సంఘటనలు చాలా మనోరంజకమయినవి.

ఒకసారి హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ పిల్లలతో ఆడుకుంటున్నారు ఇంతలో ఒక మనిషి వచ్చి పెద్ద కేక పెట్టి పిల్లల్ని భయపెట్టాడు. పిల్లలు భయపడి పరారయ్యారు, అయితే హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ [రజి] సంబాళించుకొని తిరిగి వెళ్ళి పిల్లలందరినీ ఉద్దేశించి "మిత్రులారా, భయపడకండి. మీరంతా కలిసి నా నాయకత్వాన అతనిపై దాడి చెయ్యండి" అని అన్నారు.

పిల్లలంతా తిరిగివచ్చిన తరువాత వారిని తీసుకొని హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) అతనిపై దాడి చేసి అతణ్ని పారద్రోలారు.

మరోసారి పిల్లల్తో ఇలాగే ఆడుతుండగా హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) అటుగుండా వెళ్తున్నారు. హజ్రత్ ఉమర్ ఫారూఖ్ అంటే అందరికీ భయమే. అందువల్ల పిల్లలంతా పారిపోయారు. అయితే హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి)అలాగే నిల్చున్నారు. "నీ వెందుకు పారిపోలేద"ని హజ్రత్ ఉమర్

(రజి) అడిగారు. "నేనెందుకు పారిపోతాను ? నేనేమయినా తప్పుచేశానా లేక మీరు వెళ్ళకుండా దారికడ్డంగా నిల్చున్నానా?" అని నిర్భయంగా సమాధానం చెప్పారు.

ఈ జవాబు విన్న హజ్రత్ ఉమర్ (రజి) చిరునవ్వుతో వెళ్ళిపోయారు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) నాలుగయిదు సంవత్సరాల వయస్సులో ఉండగా అవిశ్వాసులు మదీనాపై దండెత్తారు. అయితే దైవానుగ్రహంతో ముస్లిములంతా ప్రియప్రవక్త [సఅసం]తో కలసి వారిని తరిమేశారు. అవిశ్వాసులతో ముస్లింలు పోరాడుతున్నప్పుడు హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్(రజి)తన తోటి సహచరుణ్ణి వెంటబెట్టుకొని వెళ్ళి ఒక ఎత్తయిన దిబ్బపై నిల్చునేవారు. అక్కణ్ణుండే జరిగే పోరాటాన్ని చూచేవారు. "అదో అటు చూడండి, ఆ బాణం వచ్చి పడిపోయింది" అనుకుంటూ సమీక్షించుకునేవారు.

వీరి ధైర్యం మరియు పరాక్రమాన్ని చూచి హజ్రత్ జుబైర్ [రజి] వీరిని ప్రియప్రవక్త [సఅసం]సన్నిధికి తీసుకువెళ్ళారు. ఆ సమయంలో హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ [రజి] వయస్సు ఏడు సంవత్సరాలు. ఆ చిన్నారి పొన్నారి బాలవీరుణ్ణి చూచి ప్రవక్త [సఅసం] చిరునవ్వు నవ్వి, ఆ లేబ్రాయపు ముస్లింతో ఇస్లాంను అనుసరించే వాగ్దానం తీసుకున్నారు. ఆ సమయాన్నుండే హజ్రత్ అబ్దుల్లా బిన్ జుబైర్ [రజి] ప్రవక్త [సఅసం] సన్నిధిలో రావడం మొదలుపెట్టారు. ప్రవక్త [సఅసం] తరువాత హజ్రత్ ఆయిషా [రజి అన్హా] ఆయన్ని నియమానుసారంగా తమ వద్దనే

అజ్ఞల్ని శిరసావహిస్తుండేవారని అర్థం. వీరి ప్రాతినిధ్య పరి పాలనా కాలంలో ఇస్లామియా ప్రభుత్వం ఎంతో అభివృద్ధి చెందింది. వీరి బాల్యంలో జరిగిన ఓ సంఘటన మనకు పుస్తకాల ద్వారా తెలుస్తుంది. ఇది ఎంతో ఆసక్తికరంగా వుండడమే గాక అనుసరింపదగిందీను

వీరి తండ్రి అబ్దుల్ అజీజ్ బిన్ మర్వాన్ [ఈజిప్ట్ దేశ గవర్నర్) వీరిని ధార్మిక విద్యను నేర్చుకోవడానికి మదీనాకు పంపించారు. మదీనాలో ప్రసిద్ధి చెందిన విద్వాంసులయిన హజ్రత్ సాలెహ్ బిన్ కేసాన్ (రహ్మాలై) వద్ద విద్య నేర్చుకుంటూ వారి మామ హజ్రత్ అబ్దుల్లా బిన్ ఉమర్ [రజి] ఇంట వుంటుండేవారు. హజ్రత్ సాలెహ్ బిన్ కేసాన్ [రహ్మాలై] ఎంత బాధ్యతాయుతంగా చదువు నేర్పేవారో మనం ఈ చిన్న విషయంతో ఊహించగలం. ఒకసారి ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ నమాజ్ చేయడానికి అలస్యంగా వచ్చారు. సాలెహ్ బిన్ కేసాన్ (రహ్మాలై) ఆలస్యానికి కారణం అడిగారు. సమాధానంగా అజీజ్ "తల దువ్వుకోవడంలో ఆలస్యమయింద"ని చెప్పారు. ఇది విని హజ్రత్ సాలెహ్ (రహ్మాలై) కోపంతో ''మంచిది, తల దువ్వు కోవడం, నమాజ్ కంటే ఎక్కువ అని భావిస్తున్నావా?" అని అన్నారు, వెంటనే హజ్రత్ సాలెహ్, అబ్దుల్ అజీజ్ (ఈజిప్ట్ గవర్నర్)కు ఓ లేఖ వ్రాశారు. అక్కణ్నుండి ఓ మనిషి వచ్చి వెంట్రుకలను కత్తిరించాడు. ఆ పై ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ [రహ్మాలై] మారు మాటాడలేక పొయ్యారు.

ఈ విధంగా ఆయన ధార్మిక విద్యను అభ్యసించారు. అందుకే వారు 'ఖులఫాయె రాషిదీన్'లో చేరి ప్రజల చేత

ఖలీఫాయె రాషిద్ అని పిలువబడేవారు. [ దైవం వారిని కరుణించు గాక! ]

—(o)—

# అల్లామా ఇబ్నె తైమియ్యా [రహ్మలై] బాల్యం

ఒకసారి హల్బ్ పట్టణానికి చెందిన ఓ విద్వాంసుడు డెమాస్కస్‌కు వచ్చారు. అచట అహమద్ బిన్ తైమియ్యా అనే పేరు గల బాలుడున్నాడని, ఆయన అతి తక్కువ సమయంలో తన పాఠాన్ని కంఠస్తం చేస్తాడని ఆ పండితులు విన్నారు. ఆయనకు ఆ బాలుణ్ణి చూసి, పరీక్షించాలని కుతూహలం కలిగింది. ఇబ్నె తైమియ్యా పాఠశాలకు వెళ్ళే దారిలో ఒక దర్జీ వాని దుకాణ మున్నది. అక్కడ ఆ పండితులవారు కూర్చున్నారు. "ఇదే దారిగుండా ఆ బాలుడు బడికి వెడతాడు, ఇప్పుడు అతను వచ్చే సమయమయింది. మీరు ఇక్కడే కూర్చోండ"ని ఆ దర్జీవాడు అన్నాడు. కొంతసేపయ్యాక అటుగుండా కొంతమంది పిల్లలు వెళ్తూ ఉండటం జరిగింది. ఆ దర్జీ "అదిగో చూడండి ఆ పిల్లల్లో

పెద్ద పలక చేతపట్టుకున్న అతనే ఇబ్నె తైమియ్యా(రహ్మలై)'' అని అన్నాడు.

షేఖ్ ఆ పిల్లవాణ్ణి పిలిచి, అతని పలక తీసుకున్నారు. ఆపై "పలకపై వ్రాసి వున్నదంతా చెరిపేయమ"ని అన్నారు ఆ బాలుడు అలాగే చేశాడు. తరువాత ఆయన దానిపై పదకొండు లేక పదమూడు హదీసుల్ని వ్రాసి వీటిని చదవమని చెప్పారు. ఆ పిల్లవాడు ఒకసారి బాగా శ్రద్ధతో చదివాడు. ఆ తరువాత ఆ పండితుడు పలక తీసుకుని ఇక వాటిని వినిపించమని అతనితో అన్నారు మొత్తం హదీసుల్ని ఆ పిల్లవాడు ఒప్పజెప్పాడు. మరల షేఖ్ "వాటిని చెరిపేయమ"ని చెప్పి పలకపై కొన్ని సూచనలు, ధృవీకరణలు వ్రాసి యిచ్చి వాటిని చదవమని చెప్పారు. మరల ఆ పిల్లవాడు ఒకసారి బాగా శ్రద్ధగా చూసి తిరిగి వాటిని పండితునికి వినిపించాడు ఆ బాలుని జ్ఞాపక శక్తిని చూసిన షేఖ్ "ఈ పిల్లవాడు బ్రతికి వుంటే ఎంతో గొప్పవాడౌతాడు, ఎందుకంటే ఈ రోజుల్లో ఇలాంటివారు దొరకడం చాలా కష్టమ''ని అన్నారు.

ఈ ఇబ్నె తైమియ్యాయే పెద్దవారయ్యాక తన సమకాలీనుల్లో పెద్ద పండితులయ్యారు. వీరు తన విద్య ద్వారా తానున్న భూమిపై చెడును రూపుమాప కృషి సలిపారు. ఇస్లాం శత్రువులతో పోరాడారు. అల్లామా ఇబ్నె తైమియ్య (రహ్మలై) దైవానికి తప్ప ఇతరులెవరికీ భయపడేవారు కాదు. ఆయన కాలం నాటి రాజుల తప్పుల్ని ఎత్తి చూపిస్తూ వారికి హితోపదేశం చేసేవారు ఇప్పటికీ వీరి పుస్తకాల్ని చదివి పెద్ద పెద్ద పండితులు కూడా లాభం పొందుతున్నారు.

# అల్లామా ఇబ్నె జౌజీ (రహ్మాలై)
# బాల్యం

అల్లామా ఇబ్నె జౌజీ (రహ్మాలై) హిజ్రి 508వ సంవత్సరంలో జన్మించారు. దీని భావమేమంటే వీరు జన్మించి కూడా ఇప్పటికి దాదాపు 900 సంవత్సరాలయింది. వీరి తల్లిదండ్రులు బగ్దాద్ నివాసులు. ఆ కాలంలో బగ్దాద్‌లో గొప్ప పండితులుండే వారు. వీరి తల్లి ఈయన్ని ఆ కాలంలో ప్రఖ్యాత పండితుడైన ఇబ్నె నాసర్ గారి పాఠశాలలో చేర్పించారు. తను విద్యనభ్యసించే కాలం నాటి పరిస్థితుల్ని ఆయనే, స్వయంగా తన కుమారునితో చెప్పేవారు;

"నాకు బాగా జ్ఞాపకముంది — నేను ఆరు సంవత్సరాల వయస్సులో చదువుకోవడానికై బడికి వెళ్ళేవాణ్ణి. దారిలో నేను పిల్లల్తో ఆడినట్లుగాని, నవ్వినట్లుగాని నాకు గుర్తులేదు. యేడేళ్ళ వయస్సులో జామియా మస్జిద్ మైదానం గుండా వెళ్తూ పెద్దపెద్ద విద్వాంసుల హదీసు ఉపన్యాసాల్ని వింటూ ఉండేవాణ్ణి వాళ్ళు చెప్పింది బాగా జ్ఞాపకముంచుకొని ఇంటికొచ్చి వాటిని వ్రాసుకునే వాణ్ణి. నాతో సమాన వయస్సుగల పిల్లలు సముద్రపు ఒడ్డున ఆడుతుండేవారు లేదా ఏనుగుల వాని తమాషాలో లేదా

మాంత్రికుని మాయాజాలాన్ని చూడడానికి వెళ్ళేవారు. కాని నేను వారి నుండి వేరుగా వుండి, పుస్తకాలు చదువుకుంటూ వుండేవాణ్ణి.

నేను నా ఉపాధ్యాయుల వద్దకు లేక పండితుల దగ్గరకు వెళ్ళడానికి ఎంతో తొందరపడేవాణ్ణి. ఒకవేళ ఎప్పుడయినా ఆలస్యం జరిగితే ఎంతో వేగంతో రొప్పుతూ రొజుతూ పరుగెత్తేవాణ్ణి. నా రేయింబవళ్ళు చదువులోనే గడిచిపోయేవి. నా తిండి విషయంలో సరయిన ఏర్పాట్లు ఉండేవి కావు ఏది దొరికినా దేవునికి కృతజ్ఞతలు తెల్పుకుంటూ తినేవాణ్ణి దైవానుగ్రహంవల్ల నేను తిండికై ఎవరి వద్దా చేయి చాపలేదు. ఈ విషయంలో దైవం తప్ప ఇంకెవరి ఉపకారమూ నాపై లేదు."

చూశారా! అల్లామా గారికి బాల్యంలో చదువుపట్ల ఎంత శ్రద్ధ ఉండేదో! ఇంకా ధార్మిక విద్య నేర్చుకోవడానికి ఆయనెంత కష్టపడ్డారో! ఆ శ్రద్ధ మరియు శ్రమల ఫలితంగానే దైవం వారి కష్టాల్ని దూరం చేశాడు. తాను 20 వేల పుస్తకాల్ని చదివినట్లు స్వయంగా తనే చెప్పుకునేవారు. పుస్తకాలంటే తన మనసు ఎప్పుడూ విసుగు చెందలేదు. ఏదయినా కొత్త పుస్తకం దొరికితే ఎంతో సంపద లభించినట్లు భావించేవారు

ఈ విధంగా అల్లామా ఇబ్నె జౌజీ (రహ్మలై) గొప్ప విద్యావేత్త అయ్యారు. వీరి ద్వారా ఇరవై వేల మంది ధర్మాన్ని స్వీకరించారు. మరియు కొన్ని లక్షలమంది వీరి ఉపన్యాసాలు విని చెడు గుణాలను వదిలేశారు. దైవం మనకూ వారిలానే కర్తవ్య పరాయణులుగా, కార్యదక్షులుగా తీర్చిదిద్దాలని కోరుకుందాం.

(ఆమీన్)

# ఓ తెలివయిన పిల్లవాడు

ఇరాక్ అనే ఓ దేశముంది. అక్కడ ఫరాత్ అనే పేరు గల నది వుంది. ఆ నది ఒడ్డున కూఫా అనే పట్టణముంది. ప్రియప్రవక్త (సఅసం) పరమపదించిన వంద సంవత్సరాల తరువాత అక్కడ గొప్ప పండితులు జన్మించారు. ఎక్కడ్నుంచో ఆ పట్టణానికి ఓ మనిషి వచ్చాడు. అతడు మంచి పండితుడు అయినా ఓ అవిశ్వాసి. అతనికి ఇస్లామ్ అంటే గిట్టేది కాదు. అతను తన మాటల ద్వారా ముస్లింల విశ్వాసాన్ని బలహీనపరచాలని ప్రయత్నించేవాడు. ఆ విధంగా అతను ఎంతో అధర్మాన్ని వ్యాపింపజేశాడు.

ఆ మనిషే కూఫాలో వున్న పండితుల ముందు మూడు సవాళ్ళను విసిరాడు. ఏ ఒక్క పండితుడూ అతని ప్రశ్నలకు సమాధానం ఇవ్వలేకపోయాడు. ఆపై ఆ అవిశ్వాసి నడిబజారులో ఓ ఎత్తయిన ప్రదేశంలో నిల్చుని తన ప్రశ్నలకు ఏ ఒక్క ముస్లిం విద్వాంసుడూ జవాబు చెప్పలేకపోయాడని రోజూ ప్రగల్భాలు పలుకుతుండేవాడు. ఈ విషయంలో ముస్లిములంతా ఎంతో నొచ్చుకునే వారు. చివరికి దైవం తన అనుగ్రహంతో ఓ తెలివైన బాలుణ్ణి పంపాడు.

ఆ పిల్లవాడు చదువుకోవడానికై వెళుతున్న సమయంలో ఆ అవిశ్వాసి ప్రగల్భాలు విని నిల్చుండిపోయాడు. తరువాత ''నీ ప్రశ్నలకు సమాధానం నేనిస్తాన"ని చెప్పాడు. ఇది విని నాలుగు వైపుల నుండి జనం గుమికూడి "ఓ చిట్టి తండ్రీ! నీవా అతని ప్రశ్నలకు జవాబు చెప్పేది?" అని అడిగారు.

''ఇన్షా అల్లాహ్(దైవానుగ్రహమయితే)''అని ఆ పిల్లవాడు సమాధానంగా అన్నాడు.

ఆ అవిశ్వాసి తన మొదటి ప్రశ్నగా "నీ దైవం ఇప్పుడు ఏం చేస్తున్నాడ"ని అడిగాడు. ప్రశ్నించేవానికంటే సమాధానం చెప్పేవారి స్థాయి ఎక్కువ కాబట్టి మీరు నా స్థానంలోకి వస్తే నేను మీ స్థానంలోకి వెళ్ళి చెబుతాను, నా దైవం ఇప్పుడు ఏం చేస్తున్నాడో"అని ఆ బాల విద్యార్థి అన్నాడు.

విద్యార్థి మాట విని ఆ అవిశ్వాసి క్రిందికి దిగి వచ్చాడు. ఆ పై ఆ బాలుడు ఎత్తయిన చోటికి వెళ్ళి నిల్చుని "ఓ ప్రజలారా! మీరే సాక్షులుగా వుండండి. నా దైవం ఈ సమయంలో ఓ అవిశ్వాసి స్థాయిని తగ్గిస్తూ, ఓ విశ్వాసి అయిన బాలుని గౌరవాన్ని అధికం చేస్తూ ఉన్నాడ"ని అన్నాడు.

అతి చిన్న వయస్సుగల ఆ బాలుని సమాధానం విని జనమంతా నలువైపుల నుండి గుమికూడి వాహ్....వాహ్వా అని పొగుడుతూ, "నిజం, నిజం" అని అన్నారు. ఇది విని ఆ అవిశ్వాసి ఎంతో అవమానం చెందాడు. ఎత్తయిన స్థానంలో వున్న ఆ విద్యార్థి "ఊఁ.... నీ రెండవ ప్రశ్న ఏమిటో చెప్పు" అని అడిగాడు.

"దేవునికంటే ముందు ఏముండేది?" అని తన రెండవ సవాలును విసిరాడు ఆ మనిషి.

"అయ్యా! మీరైతే ముందు తొమ్మిది నుంచి క్రిందికి వరుసగా అంకెలు లెక్కయిండి" అని ఆ బాల విద్యార్థి అన్నాడు. అతను "తొమ్మిది, ఎనిమిది, ఏడు, ఆరు, ఐదు, నాలుగు, మూడు, రెండు, ఒకటి" అని చెప్పి ఊరకుండిపోయాడు. ఇది విని "అయ్యా! మీరెందుకు ఆగిపోయారు, లెక్కిస్తూ ఉండండి. కానివ్వండి, ఆ ఒకటికి ముందు....?" అని ఆ బాలుడన్నాడు. సమాధానంగా ఆ మనిషి "ఒకటికి ముందు ఎలాంటి అంకె లేదు" అని అన్నాడు. చిరునవ్వుతో ఆ విద్యార్థి "అయ్యా! దేవుడు కూడా ఒక్కడే. ఒక్కడైన ఆ దైవానికి పూర్వం ఏముండలేదు" అని సమాధానంగా అన్నాడు.

బాలుని ఈ సమాధానం విన్న ఆ మనిషి నిర్ఘాంతపోయి తన నుదుటిమీది చెమటను తుడుచుకోవటం మొదలెట్టాడు. ప్రజలు అంత చిన్న వయస్సు గల బాలుని తెలివితేటలపట్ల అబ్బురపడ్డారు. కొంత సమయమయ్యాక ఆ విద్యార్థి "ఆ! అయ్యగారూ! మీ మూడవ ప్రశ్న ఏమిటి?" అని అడిగాడు. అందుకు అతను "దేవుని ముఖం ఏ దిశన వున్నది?" అని ప్రశ్నించాడు

ఈ ప్రశ్నకు సమాధానమివ్వడానికి ఆ బాలుడు ఒక క్రొవ్వొత్తిని తెప్పించి దాన్ని వెలిగించాడు. ఆపైన ఆ మనిషితో "అయ్యా! ఈ వెలుగు ఏ దిశన వున్నదో చెప్పండి" అని అన్నాడు. సమాధానంగా ఆ అవిశ్వాసి "నలువైపులా" అని అన్నాడు.

ఆ బాల విద్యార్థి బిగ్గరగా "ప్రజలారా; మీరే సాక్షులుగా వుండండి. దైవం కూడా ఓ జ్యోతియే, అనగా వెలుగు. ఆయన ముఖం కూడా నలువైపులా వ్యాపించి వుంది. ఆయన అన్ని దిక్కుల్నీ పరికిస్తూ, అంతా గమనిస్తూనే వున్నాడు"అని అన్నాడుకి

మూడో ప్రశ్నకు సమాధానం వింటూనే ఆ అవిశ్వాసి నోటికి తాళం పడింది. తరువాత అక్కడ్నుంచి తన ముఖం చాటు చేసుకుంటూ వెళ్ళిపోయాడు. ప్రజలంతా ఆ విద్యార్థిని శభాష్! అంటూ ఎంతో ప్రశంసించారు.

ఆ విద్యార్థి ఎవరో మీకు తెలుసా ? అతనే హజ్రత్ ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై). పెద్దవారయ్యాక గొప్ప ఇమామ్‌గా ప్రసిద్ధి చెందారు నేటికీ ప్రపంచ ముస్లింలంతా ఆయన పేరును ఎంతో వినయంగా పలుకుతారు. అలాంటి పెద్దలు,సజ్జనులు చూపిన బాటపై నడిచే శక్తిని దైవం మనందరి. ప్రసాదించు గాక !

—)o(—

# ఇమామ్ అబూ యూసుఫ్ (రహ్మతుల్లై)

# బాల్యం

మీరు విద్యాజ్ఞానం కలిగిన ఏ ఒక్క ముస్లిం వ్యక్తితోనైనా గొప్ప ఇమామ్ (ధర్మవేత్త)లు ఎవరని అడిగితే, మొదటివారు హజ్రత్ ఇమామ్ అబూ హనీఫా (రహ్మతుల్లై), రెండవ వారు హజ్రత్ ఇమామ్ మాలిక్ (రహ్మతుల్లై), మూడవ వారు హజ్రత్ ఇమామ్ షాఫయి (రహ్మతుల్లై), నాల్గవవారు హజ్రత్ ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మతుల్లై) అని అతను నలుగురి పేర్లను సూచిస్తాడు.

ఆ నల్గురు ఇమామ్‌లలో హజ్రత్ ఇమామ్ అబూ హనీఫా (రహ్మతుల్లై)ను ''ఇమామె ఆజమ్" (మహానాయకుడు) అని కూడా పిలుస్తారు. వీరి ఇద్దరు శిష్యులు అందరికంటే మిన్నగా ప్రసిద్ధి చెందారు. ఒకరు ఇమామ్ ముహమ్మద్ (రహ్మతుల్లై), రెండవవారు ఇమామ్ అబూ యూసూఫ్ (రహ్మతుల్లై). దైవం ఒకవేళ ఈ ఇద్దరు శిష్యుల్ని ప్రభవించకపోయినట్లయితే ఇమామ్ ఆజమ్ పాండిత్యాన్ని నేడు ఎవరూ ఎరిగివుండేవారు కాదు. ఈ ఇరువురు శిష్యులు ఏదయితే ఇమామ్ ఆజమ్ వద్ద చదువుకుని అభ్యాసిం

చారో దాన్ని ఎంతో శ్రద్ధతో సక్రమంగా గ్రంథస్థంచేసి ప్రపంచ ప్రజలకు అందజేశారు. తద్వారానే ఇమామ్ అజమ్ నిజంగా "ఇమామ్ అజమ్"గా పిలువబడినారు. వీరివలన చేకూరిన రెండవ ప్రయోజనం ఏమంటే సాధారణముస్లిం ప్రజానీకం ధర్మమార్గంలో నడవడానికి సులువయిన మార్గం తెలిసింది. ఈ సులువైన పద్ధతినే నేడు ''హనఫీ ఫికహ్''గా పిలుస్తారు. ఈ ఫికహ్‌ను ఇమామ్ ముహమ్మద్ (రహ్మాలై) మరియు ఇమామ్ అబూ యూసూఫ్ (రహ్మాలై) కలిసి క్రోడీకరించి ఓ రూపాన్నిచ్చారు.

ఇమామ్ ఆజమ్‌గారి ఆ ఇద్దరు శిష్యులకు దైవం ఎంతో ఉన్నతస్థానాన్ని ప్రసాదించాడు. వీరిలో ఇమామ్ అబూ యూసూఫ్(రహ్మాలై) పాండిత్య ప్రాభవాన్ని విని ఆనాటి ఖలీఫా హారూన్ రషీద్ ఆయన్ని తన రాజ్యానికి ప్రధాన న్యాయమూర్తిగా నియమించాడు. హారూన్ రషీద్ వీరిని ఎంతో ఆదరంగా చూచే వాడు. రాజుగారి తప్పిదాల పట్ల ఇమామ్ యూసూఫ్ (రహ్మాలై) హెచ్చరించేవారు, దానిపై ఆ రాజు మౌనం వహించే వాడు. రాజు గారు తన ఆహారపానీయాల్ని సేవించేటప్పుడు తనతోపాటు ఇమామ్‌గారిని కూర్చుండబెట్టుకొనేవాడు. ఒకరోజు రాజుగారి వద్దకు పిస్తా నూనెతో తయారుచేసిన పానీయం వచ్చింది. ఆయన ఆ పానీయాన్ని ఇమామ్‌గారి ముందుంచాడు. దాన్ని చూసి ఇమామ్ గారి కళ్ళు చెమర్చాయి అది చూసి రాజు తన దుఃఖానికి కారణం అడుగగా ఇమామ్‌గారు తన బాల్యంలో జరిగిన సంఘటనను ఈ విధంగా వర్ణించారు ;

''కూఫా పట్టణంలో ఓ వృద్ధుడు ఉండేవాడు. ఆయన

పేరు ఇబ్రాహీం. ఆయన కాయకష్టం చేసి జీవించేవాడు. ముసలి తనం కారణంగా తనకు కూలి కూడా తక్కువగా దొరికేది. ఆయన సతీమణి చేనేత నేసి కొంత సంపాదించేది. వారిద్దరి సంపాదనతో కూడా ఇంటి వారికి కడుపు నిండేది కాదు. పాపం వారు ఉపవాసం ఉండి తింటే సాయంత్రం పస్తుపడుకునేవారు, సాయంత్రం తింటే ఉదయం లేచి పరిగడుపుతోనే కూలికి వెళ్ళేవారు.

ఆ ముసలి ఇబ్రాహీమ్‌కు ఓ పిల్లవాడుండేవాడు. ఆయన పేరు యాఖూబ్. పిల్లవాడికి పదిపన్నెండేళ్ళు వచ్చాయి గనుక అతన్ని కూడా ఎక్కడైనా పనిలో కుదిరిస్తే ఏదైనా సంపాదిస్తాడు ఆపై ఇల్లు గడుస్తుందని తండ్రి ఇబ్రాహీం ఆలోచనలోపడ్డాడు.

ఈ విషయాన్ని ఇబ్రాహీం తన భార్యతో ప్రస్తావించాడు.. అప్పుడతని భార్య యాఖూబ్‌ను తీసుకునివెళ్ళి ఓ చాకలివాని ఇంట్లో నౌకరుగా నియమించింది. అయితే యాఖూబ్ మనసు పని చేయడం పట్ల సుముఖంగా లేదు. చదువుకోవాలని ఎంతో అభిల షించేవాడు. ఆయన మహనీయ ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ప్రపంచ మానవులకు ఏ జ్ఞానాన్నయితే ప్రసాదించారో, దాన్ని తెలుసుకుని ప్రవక్త (సఅసం) మరియు దేవుని ఆజ్ఞల్ని గ్రహించి వాటిని ఇతరులకు అందజేసి పుడమిపై ధర్మాన్ని వ్యాపింపజేయా లని కోరుకునేవాడు.

ఆ తరువాత యాఖూబ్ ఇంటినుండైతే పనికి వెళ్ళే సాకుతో బయలు దేరి ఒక పాఠశాలకు వెళ్ళేవాడు. ఆ పాఠశాలలో ఓ గొప్ప పండితుడు చదువు చెప్పేవాడు. వారి పేరు అబూ హనీఫా (రహ్మాలై). ఆ కాలంలో హజ్రత్ అబూ హనీఫా(రహ్మాలై)అందరి కంటే గొప్ప పండితులు. గట్టి దీక్షగల యాఖూబ్ హజ్రత్ ఇమామ్

అబూ హనీఫా (రహ్మాలై) వద్ద విద్యను నేర్చుకుంటున్నాడు. ఈ విధంగా ఒక నెల గడిచిపోయింది. తరువాత అతని తల్లిదండ్రులు నెల జీతము తీసుకురమ్మని యాఖూబ్‌తో చెప్పారు. చాకలివద్దకు పనికి వెళ్ళకుండా యాఖూబ్ జీతం ఎక్కణ్ణుంచి తీసుకురాగలడు. పదే పదే ఈ విషయం అడిగిన తరువాత తన తల్లిదండ్రులు తెలుసుకున్నారు— యాఖూబ్ రోజూ హజ్రత్ ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై)గారి పాఠశాలకు విద్య నేర్చుకోవడానికి వెళ్తున్నాడని.

ఇది తెలిసి తల్లి ఎంతో కోపగించుకుంది. ఆమె యాఖూబ్‌ను తీసుకుని పాఠశాలకు వెళ్ళింది. ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై)తో ''అయ్యా నేను చేనేత నేసి సంపాదించి ఈ పిల్లవాణ్ణి పోషిస్తున్నాను. ఈ పిల్లవాణ్ణి కూడా సంపాదనకోసం ఓ చాకలివద్ద నౌకరుగా నియమించాను. కాని ఇతడేమో రోజూ మీ వద్దకు వస్తున్నాడని తెలిసింది. ఏదైనా పని చేస్తే తన రోజు గడిచిపోతుందిగాని, చదివి ఇతడు ఏం చేయగలడు? మీరయినా నచ్చజెప్పండి'' అని విన్నవించుకుంది.

ఇది విని హజ్రత్ ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై) నవ్వుకొని ఆమెతో ''ఈ పిల్లవాణ్ణి నా వద్ద వుంచు. నీవయితే ఎండిన రొట్టె తినిపించాలని భావిస్తున్నావు. కాని ఇతనేమో పిస్తానూనెతో తయారయిన పానీయాన్ని సేవించాలని కోరుకుంటున్నాడ''ని అన్నారు.

అబూ హనీఫా (రహ్మాలై)గారి ఉద్దేశ్యమేమంటే— నీవీ పిల్లవాణ్ణి తక్కువగా అంచనా వేసి చిల్లర పనులు చెప్పి కొద్దిగా సంపాదించదలిచావు. కాని ఇతడు పెద్దవాడై గొప్పపనులు చేయా

లని కోరుకుంటున్నాడని. అయితే ఈ విషయం ఆ ముసలా విడకు అర్థం కాలేదు. ఆమె కోపంతో ఈ ముసలాయనకు కూడా మతి చలించిందని గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన తరువాత ఇమామె ఆజమ్ ఆమె ఇంటి ఖర్చు భారాన్ని తనదిగా భావించారు. ఇమామ్‌గారి వ్యాపారంలో దేవుడు తన అనుగ్రహాన్ని కురిపించాడు ఆయన యాఖూబ్ తల్లిదండ్రులకు ఓ పెద్ద మొత్తం పంపడం ప్రారంభించారు. తరువాత యుఖూబ్ ఏకాగ్రతతో మనస్సును చదువుపై లగ్నం చేశాడు. యాఖూబ్ ఎంతో కష్టపడి చదువుతుండేవాడు. ఇమామె ఆజమ్ కూడా ఎంతో శ్రమతో చదివించారు. దాని ఫలితంగానే యాఖూబ్ గొప్ప విద్వాంసుడయ్యాడు. ఇమామె ఆజమ్‌కు యాఖూబ్ అంటే నమ్మకం కుదిరింది. ఆపై ఇమామె ఆజమ్ పాఠశాలను మరియు తన సమస్త పుస్తకాలను శిష్యులకు అప్పగించారు. ఆ శిష్యుల్లో యాఖూబ్ కూడా ఒకడు. అతనే మున్ముందు "అబూ యూసుఫ్" అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. ఇప్పుడు ఆ అబూ యూసుఫే మీతో పాటు విందులో పాల్గొన్నది—— అతని ముందరే మీరు పిస్తా నూనెతో తయారుచేసిన పానీయాన్ని ఉంచారు.

ఓ రాజా! ఏ మాటలైతే ఆ సమయంలో ఇమామె ఆజమ్ నా తల్లితో అన్నారో, అవే ఇప్పుడు నాకు గుర్తుకొస్తున్నాయి. నేను నా కళ్ళ ఎదుట పిస్తా నూనెతో తయారుచేయబడిన పానీయాన్ని పొందగలిగాను. ఇమామె ఆజమ్(రహ్మతుల్లా)గారి మాట ఎంత సత్యమయినది! దైవం వారిపై తన కారుణ్యాన్ని కురిపించుగాక!"

ఇమామ్ అబూ యూసుఫ్ (రహ్మాలై) ఈ వృత్తాంతాన్ని వినిపించి మౌనం వహించారు. ఇది విని రాజు హారూన్ రషీద్ ఎంతో సంతోషించాడు. వారితో ఇది విన్న ఇతరులు కూడా ఎంతో ఆనందించారు. మనకు కూడా దైవం అలాగే జ్ఞానార్జన పిపాసను ప్రసాదించుగాక !

—)o(—

# షేఖ్ అబ్దుల్ ఖాదర్ జీలానీ [రహ్మాలై] బాల్యం

షేఖ్ అబ్దుల్ ఖాదర్ జీలాని (రహ్మాలై) అనే ఓ మహనీయులు గతించారు. ప్రజలు ఆయన్ని బడే పీర్ సాహెబ్ (పెద్ద గురువుగారు) అని పిలుస్తారు. నిజంగా ఆయన ఎంతో ఉత్తమమయినవారు. అంతే కాకుండా ఆయన ధార్మిక విషయాలు కూడా తెలిసినవారు. పెద్దలకు, చిన్నలకు అందరికీ అర్థమయ్యే రీతిలో ధార్మిక విషయాలను బోధించేవారు. వారు ఎంతో గొప్ప ధార్మిక సేవ చేశారు కాబట్టే ప్రజలు ఆయన పేరును గౌరవభావంతో పిలుచుకుంటున్నారు. షేఖ్ (రహ్మాలై) గారి స్వస్థలం గీలాన్ అనే గ్రామం. అయితే ఆయన బగ్దాద్

వెళ్ళి గొప్ప విద్వాంసుల వద్ద జ్ఞాన సముపార్జన గావించారు. వారి బాల్యంలో జరిగిన ఓ సంఘటన మిక్కిలి ప్రసిద్ధి చెందింది.

పుస్తకాల ద్వారా మనకు తెలిసేదేమంటే ఆయన తన ప్రాథమిక విద్యలు గీలాన్ గ్రామంలోనే పూర్తి చేసిన తరువాత తల్లితో "అమ్మా! నాకింకా చదువుకోవాలని ఉందని" అన్నారు. వారి తల్లి కూడా మిక్కిలి సాధ్వీమణి తన కొడుకు కోరిక విని ఆమె ఎంతో సంతోషించి, ఇంకా పై చదువులు చదవాలంటే నీవు బగ్దాద్ వెళ్ళాలని చెప్పారు. ఆపై పెద్ద సయ్యదు గారు బగ్దాద్ వెళ్ళడానికి తన సుముఖతను తెలియజేశారు. తన తల్లిగారు కూడా ఎంతో సంతోషించి బగ్దాద్ వెళ్ళేందుకు అనుమతించారు. బగ్దాద్‌కు బయలుదేరేటప్పుడు నలభయి అష్రఫీలు (నవరలు) ఇస్తూ "నాయనా, నేను నిన్ను దైవం కొరకు వదులుతున్నాను. మరల నీతో కలుస్తానో లేదో తెలియదు. చివరగా నా ఉపదేశం ఒకటి మరువకు. సదా సత్యమే పలకాలి, నీపై ఎంతటి ఆపద వచ్చినా నీవు ఎల్లప్పుడూ సత్యాన్నే పలకాలని బోధించారు.

హజ్రత్ అబ్దుల్ ఖాదర్ జీలానీ (రహ్మ.) తన తల్లితో అలాగే అని మాటిచ్చి, తల్లికి వీడ్కోలు చెప్పి ఓ ప్రయాణీకుల బిడారుతో బగ్దాద్‌కు బయలుదేరారు. వెళ్ళేటప్పుడు తన తల్లి ఆ నలభయి అష్రఫీలు దారిలో పడిపోకుండా ఉండాలని చెప్పి అంగిలో వేసి కుట్టారు.

ఇక వినండి. ప్రయాణీకుల బిడారు వెళ్తూ, వెళ్తూ ఒక అడవిలో ప్రవేశించింది. అకస్మాత్తుగా దోపిడీ దొంగలు ముట్టడించారు. ప్రయాణీకుల ధనాన్ని దోపిడీ చేయడం మొదలెట్టారు.

ఒక దొంగ షేఖ్ అబ్దుల్ ఖాదర్ జీలానీ (రహ్మాలై) వద్దకు వచ్చి, "ఓ పిల్లోడా! నీ వద్ద కూడా ఏదయినా ఉందా?" అని పిలి దీశాడు. సమాధానంగా జీలానీ (రహ్మాలై) "అవును, నా వద్ద నలభయి అష్రఫీలున్నాయ"ని అన్నారు. అది విన్న ఆ దొంగ పిల్లవాడు పరాసికాలాడుతున్నాడని తలచి వెళ్ళిపోయాడు. రెండవ దొంగ వచ్చి "ఓ అబ్బాయి నీ వద్ద కూడా ఏమయినా ఉందా?" అని అడిగాడు. అతనితో కూడా "అవును నా వద్ద నలభయి అష్రఫీలున్నాయ"ని సమాధానమిచ్చారు. అతను కూడా ఈ అబ్బాయి ఏదో ఎగతాళికి అంటున్నాడని భావించి వెళ్ళిపోయాడు. ఈ విధంగా ఎంతో మంది దొంగలతో ఇదే సంభాషణ జరిగింది. చివరికి ఈ విషయం దోపిడీ ముఠా సర్దారుకు తెలిసి, అతను పిల్లవాణ్ణి పట్టి తెమ్మని ఆజ్ఞాపించాడు.

దోపిడీ దొంగలు వచ్చి పిల్లవాణ్ణి వారి సర్దారు వద్ద హాజరుపరిచారు. సర్దారు కూడా "ఓ అబ్బాయి, నీ వద్ద కూడా ఏమయినా ఉందా?" అని అని అడిగాడు. సమాధానంగా "అవును నా వద్ద నలభయి అష్రఫీలున్నాయ"ని ఆయన(రహ్మాలై) అన్నారు. "ఎక్కడ" అని సర్దారు అడిగాడు. "ఇటు చూడండి నా అంగిలో దాగివున్నవి" అని జీలానీ (రహ్మాలై) వాటిని చూపించారు.

ఈ విధంగా ధనాన్ని చూపించడం పట్ల దొంగల ముఠా సర్దారు పిల్లవానిపై దృష్టి నిలిపి, "ఓ అబ్బాయి మేము ఈ బిడారును దోపిడీ చేస్తున్న విషయం నీకు తెలుసు కదా, మరి నీవెందుకు ఇలా నీ ధనాన్ని చూపిస్తున్నావు" అని అడిగాడు సమాధానంగా ఆయన (రహ్మాలై) "నా తల్లి నాతో వెల్లిప్పుడు

సత్యాన్నే పలకాలని వాగ్దానం తీసుకున్నారు. మరి నేనెలా అబద్ధం చెప్పగలను" అని అన్నారు.

ఇంత చిన్న బాలుని మాటలు దొంగల ముఠా సర్దారు మనస్సును ప్రభావితం చేశాయి. ఉన్నట్టుండి అతను ఏడ్వడం ప్రారంభించాడు. తరువాత ఆ సర్దారు "సొమ్ము దోపిడీకి గురయినా ఫర్వాలేదుగాని, ఓ పిల్లవానికి తన తల్లికి ఇచ్చిన మాట పట్ల ఇంత శ్రద్ధ ఉంది అయితే నా విషయం ఎంత విచారకరమయింది? నేను దైవంతో వాగ్దానం చేశాను— నీవే నా ప్రభువని, నీ ఆజ్ఞలనే పాలిస్తానని. కాని ఎంత ఘోరం! సంవత్సరాల తరబడి ఆ వాగ్దానాన్ని మరచి, దైవం పట్ల అవిధేయత చూపుతున్నాన"ని అంటూ విలపించాడు.

తరువాత ఆ సర్దారు పశ్చాత్తాపపడి, తన ముఠాతో "దోపిడీ చేసిన ప్రయాణీకుల సొమ్మును వాపసు ఇచ్చివెయ్యండ"ని ఆజ్ఞాపించాడు. ఆయన ఆజ్ఞతో మొత్తం సొమ్ము వాపసు చేశారు ఆ పిదప తతిమ్మా దోపిడీ దొంగలు కూడా తమ తప్పుడు విధానంపట్ల పశ్చాత్తాపపడ్డారు.

పిల్లలూ! సకల స్తోత్రాలు దైవానికే. అంతా దైవానుగ్రహం. హజ్రత్ అబ్దుల్ ఖాదిర్ జీలానీ (రహ్మలై) గారికి ఎంత మంచి తల్లి దొరికారు! ఇంకా దేవుని కరుణానుగ్రహాల వల్లనే ఆయన (రహ్మలై) మంచి విషయాలను గుర్తుంచుకొని వాటి ప్రకారం ఆచరించారు, మనకూ మంచి విషయాల పట్ల శ్రద్ధాసక్తులను ప్రసాదించాలని దైవాన్ని వేడుకుందాం!

—(o)—

# సయ్యిద్ అహ్మద్ షహీద్ [రహ్మాలై] బాల్యం

మన దేశంలో సుమారు 200 లేక 250 సంవత్సరాల క్రితం దైవభక్తి పరాయణుడయిన ఓ సజ్జనుడుండేవాడు. ఆయన పేరు సయ్యిద్ అహ్మద్. దేవుని కరుణానుగ్రహాలు ఆయనపై కురియుగాక! సయ్యిద్ సాహెబ్ లక్నోకు సమీపాన వున్న రాయ్ బరేలీ అనే ఓ పల్లెటూరులో జన్మించారు. ఆయన ధర్మప్రచారం చేయుటానికి మరియు దైవ సందేశాన్ని దైవ దాసులయిన మానవుల వరకు చేరవేయడానికి ఎల్లప్పుడూ కృషి చేసేవారు ఇస్లాం ఈ భూమిపై ఇతరులకు లొంగివుండడానికి ప్రభవించలేదని ఆయన అంటూండేవారు. ఇంకా ఆయన, దేశ పరిపాలనా వ్యవహారం ఎప్పటివరకయితే దైవదాసులయిన సజ్జనుల చేతుల్లోకి రాదో అప్పటి దాకా ప్రజలు సుఖశాంతులతో వుండలేరని కూడా అనేవారు. ఈ కారణంగానే ఆయన బ్రిటీషువారి పరిపాలనను వ్యతిరేకించేవారు. సయ్యిద్ అహ్మద్ షహీద్‌కు దైవ మార్గంలో ప్రాణత్యాగం చేయాలని అమరగతి పొందాలని ఎంతో కుతూహలంగా ఉండేది. చివరికి ఆయన దైవ మార్గంలో పోరాడుతూనే ప్రాణత్యాగం చేశారు. వీరి బాల్యం నాటి సంఘటనలు ఎంతో ఆసక్తికరమయినవే కాక, విశ్వాసాన్ని కూడా వికసింపజేస్తాయి కొన్ని విషయాలు ఈ క్రింద వ్రాస్తున్నాము :

బాల్యంలో సయ్యద్ అహ్మద్ సాహెబ్ (రహ్మతె)కు ఆట లంటే ఎంతో ఇష్టంగా ఉండేది. అయితే ఆయన చెడు ఆటల జోలికి పోయేవారు కాదు. ఏవైతే మనిషికి శరీర దారుఢ్యాన్ని పెంపొందించి, మన స్థయిర్యాన్ని కలుగజేస్తాయో, అటువంటి ఆటల్నే ఆడేవారు ఆయన కబడీ ఆటను ఎంతో ఉల్లాసంగా ఆడేవారు ఆయన. తన సహవాసులందరిని రెండు జట్లుగా చేసి, ఒక జట్టు వేరొక జట్టుతో తలబడటానికి పురిగొలిపేవారు. ఈ ఆటలో స్వయంగా తను కూడా ఎంతో మక్కువతో పాల్గొని, బహుమతులు గెలిచేవారు. ఇంకా ఆయన ప్రత్యర్థి జట్టును తరిమి కొడుతూ ఆనందించేవారు. అప్పుడప్పుడు తన జట్టును "ఇస్లామియా జట్టు"గా పేరు పెట్టి దైవనామం జపిస్తూ రెండవ జట్టును ఎదుర్కొనేవారు.

సయ్యద్ సాహెబ్‌కు వ్యాయామం పట్ల కూడా ఆసక్తి వుండేది. ఆయన ప్రతి రోజు ఉదయం సూర్యోదయం తరువాత ఒక గంట వ్యాయామం మరియు కుస్తీ కూడా చేసేవారు. దానితో పాటు ఐదు వందల బస్కీలు కూడా తీసేవారు. అంతేకాకుండా ఇరవై ఇరవై కిలోలు, ముప్పై ముప్పై కిలోలు, మరియు మణుగు మణుగు బరువుగల వందెపు రాళ్ళను గంటల తరబడి ఎత్తుతూ వుండేవారు. ఈతలో కూడా ఆయన నేర్పరే.

ఆయనకు బాల్యం నుండే దైవ మార్గంలో పోరాడాలని కోరిగ్గా ఉండేది. ఒకసారి దైవ మార్గంలో ప్రాణాలొడ్డే సమయం వచ్చినప్పుడు కత్తి కొరకు ఆయన ఇంటికి దౌడు తీశారు. కత్తి తీసుకుని తన తల్లి అనుమతి కొరకు వెళ్ళారు. ఆ సమయంలో ఆమె నమాజ్ చేస్తున్నారు. ఇంతలో తనకు పాలుపట్టిన ఆయా

వచ్చింది. ఆమె సయ్యిద్ సాహెబ్‌ను ఆపి, "కుమారా! నీకేం అవసరమొచ్చిందని నీ ప్రాణాన్ని సంకటంలో పడవేసుకోబోతున్నావ"ని అన్నది.

సయ్యిద్ సాహెబ్ తల్లి నమాజ్ ముగించుకుని విషయాన్ని అడిగి తెలుసుకున్నారు. అంతా విన్న ఆ సాధ్వీమణి, "ఇదిగో! నీకు అహ్మద్ అంటే ప్రేమ వున్న మాట నిజమే కానీ అది నాతో సరిసమానం కాజాలదు అహ్మద్‌పై నీకంటే నాకే ఎక్కువ అధికారం వుంది, అయితే ఆయన మేలునే కోరుకుంటే, ఇది ఆపుకునే సమయం ఏమాత్రం కాదు. ఆయన్ని వెళ్ళనివ్వు'' అని ఆగ్రహంతో అన్నారు. మరల ప్రియపుత్రునితో "నాయనా, త్వరగా వెళ్ళు, అయితే ఒక్కమాట, పోరాటంలో వెన్ను చూపరాదు, అలా జరిగితే జీవితాంతం నీ ముఖం చూడన"ని కూడా ఆమె అన్నారు.

సయ్యిద్ సాహెబ్ పోరాటానికి వెళ్ళారు. కాని కొంత మంది ఎవరో తెలివయినవారు మధ్యవర్తిత్వం వహించి పోరాడే వారి మధ్య రాజీ కుదిర్చారు.

సయ్యిద్ సాహెబ్‌పై దేవుని అనుగ్రహం ఎంతో వుంది. ఒకవైపు ఆయనకు దైవం తరఫున ఎంతో శక్తి లభించింది. దైవం ఆయనకు ఎంతెంతో మనోధైర్యాన్ని ప్రసాదించాడు. ఆయనలో అణుమాత్రమైనా భయం లేకుండింది. దానికి తోడుగా తనకు ఉత్తమురాలైన తల్లి దొరికారు. ఆమె సదా మంచి పనులకై ప్రోత్సహించేవారు సయ్యిద్ అహ్మద్‌షహీద్‌పై మరియు ఆయన తల్లిపై దేవుని కరుణానుగ్రహాలు కురియుగాక!

—)o(—

# మౌలానా మౌదూది (రహ్మలై) బాల్యం

మౌలానా మౌదూది పూర్తిపేరు సయ్యిద్ అబుల్ ఆలా. అయితే ఈయన "అల్లామా మౌదూది" పేరుతో ప్రపంచంలో ప్రసిద్ధిచెందారు. ఆయన ఈ కాలంలోని గొప్ప పండితుడు. ఆయన కేవలం పండితుడవడమేగాక, తన వద్దనున్న జ్ఞానాన్ని ఇతరులకు ఎంతో మంచి పద్ధతిలో తెలియజేశారు వారు రచించిన వ్యాసాల్ని చదివిన ప్రతి తెలివైన వ్యక్తి ఇట్టే ప్రభావితుడయ్యాడు. మౌదూదిగారు ఎన్నో మంచిమంచి పుస్తకాల్ని రచించారు. వీరి రచనలు ప్రపంచమంతటా ప్రచారం పొందాయి. వాటి అను వాదాలు కూడా అనేక భాషల్లోవచ్చాయి.

అల్లామా మౌదూది ఇస్లామీయ ప్రభుత్వ సంస్థాపన విష యమై రేయింబవళ్ళు కృషిసలిపేవారు. దాని కొరకు తనవును, మనసును ధనాన్ని-సర్వాన్ని త్యాగం చేయడానికి ఎల్లప్పుడూ సిద్ధంగా వుండేవారు వారి బాల్యంలోని సంఘటనల్ని తనే స్వయంగా వ్రాసుకున్నారు. ఆయన ఇలా వ్రాసుకున్నారు;

"చాలా చిన్ననాటి విషయాలు కూడా నాకు ఇప్పటివరకూ జ్ఞాపకమున్నాయి. మొట్టమొదట నేను విన్నప్పుడు నన్ను వింతగొలిపిన విషయం ఇప్పటికీ గుర్తుంది. అదేమంటే, తండ్రి నాన్నను తాతయ్య అని, తండ్రి తల్లిని నాయనమ్మ అంటారని విన్న విషయం మా నాన్న కూడా వేరొకళ్ళకు కొడుకవుతాడనే విషయాన్ని నా మనసు నమ్మేదికాదు? ఇంకా మా నాన్న కూడా నాలానే ఓ నాడు పిల్లవానిగా వుండివుంటాడనే విషయాన్ని నేను ఊహించనైనా లేక పోయాను. ఈ కొత్త వింత విషయాల్ని విని

చాలా రోజులవరకు ఆలోచిస్తూవుండేవాణ్ణి. ఎన్నో రోజులు గమనించికనుగొన్న తరువాతగాని— నేడు ఎంత మందైతే మనుష్యు వాళ్ళున్నారో, వాళ్ళంతా ఒకనాడు చిన్నారి బాలలుగానే వున్నారని, వాళ్ళకూ తల్లీ, తండ్రీ ఉన్నారనే మాట నాకు బోధపడిందికాదు.

"నాకు బాల్యంలో 'తండ్రి' 'తల్లి' అనే పదాలకు అర్థం తెలియదు. వీరు ఎవరయి ఉంటారో, అసలు నేను వాళ్ళ దగ్గరకు ఎలావచ్చానో నాకు అర్థమయ్యేది కాదు. అయితే, నేను పిల్లప్పుడూ నా తండ్రిని ప్రపంచంలో కెల్లా గొప్ప మనిషిగా, మంచి మనిషిగా, నా తల్లి స్త్రీలందరిలో కెల్లా ఉత్తమురాలుగా తలచేవాణ్ణి.

"నేను ఏదైనా అనారోగ్యానికి గురయినప్పుడు, లేదా నాకు ఏదైనా గాయమైనప్పుడు నా తల్లి దండ్రులు నా కొరకు ఎంతో కంగారు పడేవారు. ఈ విషయం నాకు ఎంతో ఆనందం కలిగించేది. దానికొరకు నేను అప్పుడప్పుడు కావాలని ప్రమాదంలో ఇరుక్కునేవాణ్ణి. ఆ సమయంలో నా అమ్మా నాన్నల మనస్సుల్లో కంగారు మొదలయ్యేది. దాన్ని చూసి నా కొరకు వారు చాలా పరితపించేవారని నా మనస్సులో భావించేవాణ్ణి. దీన్ని చూసే తల్లి దండ్రుల్లోను, వేరే ఇతర జనుల్లోను ఎలాంటి తేడా వుందో నేను అర్థంచేసుకోగలిగాను.

"ఈ లోకాన్ని విడిపోయిన మా నాన్న ఎంతో శ్రద్ధతో నా శిక్షణచేశారు. ఆయన ఢిల్లీ సంస్కారవంతుల శిష్ట భాష మాట్లాడేవారు. నేను మాట్లాడే భాషలో ఏ దోషమూ పొడ సూపకుండా వుండాలని ఆయన మొదటినుంచే జాగ్రత్తపడేవారు. ఎప్పుడైనా నా నోటికి ఏదైనా తప్పుడు మాటవచ్చినా లేదా ఏదైనా

బజారు మాట నేను నేర్చుకున్నా అప్పటికప్పుడు నన్ను వారించి, సరిగ్గా మాట్లాడడం అలవరచేవారు. ఆ తరువాత అనుకోకుండా నాకు భారతదేశపు ఎన్నో పట్టణాల్లో గడిపే అవకాశం ఏర్పడింది. అయితే, బాల్యంలో ఏ భాష అయితే నాలో స్థిరపడిందో దానిపై ఏ ఒక్క ప్రాంతీయ యాసకూడా తన ప్రభావాన్ని వేయలేక పోయింది.

"రాత్రి సమయాల్లో మా నాన్న ప్రవక్త (అలైహి ముస్సలాం)ల గాథల్ని, ఇస్లామీయ చరిత్ర, భారతదేశ చరిత్ర లోని ఘట్టాలను ఇంకా సందేశాత్మక కథల్ని వినిపించేవారు. దాని ప్రభావం నాకు ఇప్పటికి ప్రయోజనకరంగా ఉంది.

"నా నడవడిని తీర్చిదిద్దే విషయంలో మా నాన్న ఎంతో శ్రద్ధ వహించేవారు ఆయన నన్ను చెడు చేష్టలుచేసే పిల్లలతో ఎప్పుడూ ఆడనిచ్చేవారు కాదు. ఒకవేళ ఎప్పుడయినా నేను ఏదైనా చెడ్డ విషయం అలవాటుచేసుకుంటే ఎంతో ప్రయత్నించి దాన్ని దూరం చేసేవారు.

ఓ సారి నేను పనిమనిషి పిల్లవాణ్ణికొట్టాను. ఆ తరువాత ఆ పిల్లవాణ్ణి పిలిపించి "నీవు కూడా ఇతన్ని కొట్టు!" అని అన్నారు మా నాన్న. దాంతో నాకు కలిగిన గుణపాఠం వల్ల నేను, ఇంకెప్పుడూ బలహీనులపై చేయి చేసుకోలేదు. మా నాన్న నన్ను ఎక్కువగా తనతో పాటు ఆయన మిత్రులవద్దకు తీసుకొని వెళ్ళేవారు. వారి మిత్రులంతా సంస్కారవంతులు బాగా చదువు కున్నవారు. అలాంటి సజ్జనుల మధ్య కూర్చొనబట్టి నేనెన్నో మంచి అలవాట్లు నేర్చుకున్నాను.

మా నాన్న నా విద్యాభ్యాసాన్ని ఇంటి వద్దనే ఏర్పాటు చేశారు. నన్ను చెడు పిల్లల దురలవాట్ల నుండి దూరంగా

ఉంచాలని. నేను మాట్లాడే భాషలో దోషాలు చోటు చేసుకో కుండా ఉండాలనే ఉద్దేశ్యంతోనే ఆయన ఆ ఏర్పాటుచేశారు.

ఇంటివద్ద విద్యాభ్యాసం నా విషయంలో నాకు ఎంతో ప్రయోజనకరమయింది. వేరే విద్యార్థులు ఎనిమిది, పదేళ్ళు నేర్చుకున్నంత చదువును నేను ఇంటివద్ద ఐదు, ఆరు సంవత్స రాలలోనే నేర్చుకున్నాను. నా పదకొండవ యేట నన్ను ఆరవ తరగతిలో చేర్పించారు. విద్యార్థులందరికంటే నేను చిన్నవాణ్ణి అయినా అందరికంటే ఉత్తమ విద్యార్థిగా ఎంచబడ్డాను.

"పాఠశాలలో ప్రవేశించాక అక్కడి మంచి వారు మరియు చదువుపట్ల శ్రద్ధగల విద్యార్థులతో స్నేహం పెంచుకున్నాను. నా ఉపాధ్యాయుల్ని నేనెంతో గౌరవించేవాణ్ణి. వారు కూడా నేనంటే ప్రేమ చూపేవారు.

"మొట్ట మొదటి సారిగా పాఠశాలలోనే వ్యాసరచన చేయ డానికి, వక్తృత్వం (ఉపన్యాసం)లో పాల్గొనడానికి నాకు అవ కాశం లభించింది. దాంతో నేను నా నోటి ద్వారాను రచనల ద్వారాను ఏదయినా సాధించగలనని గ్రహించాను. కొద్ది రోజుల్లోనే పాఠశాల పట్ల నాలో మక్కువ పెరిగింది. ఆపై చదువుపట్ల కూడా ఎంతో శ్రద్ధ చూపేవాణ్ణి. ఎక్కువ రోజులు సెలవువస్తే మేము కొంత మంది విద్యార్థులం కలిసి అధ్య యనం చేసే నిమిత్తమై ముందుగా కార్యక్రమం నిర్ణయించుకునే వారం ఓ ప్రదేశంలో సమావేశమయి అక్కడే అందరం కలిసి ఆడుకునే వాళ్ళం.

అయితే ఎప్పుడూ నేను మంచి ఆటగాణ్ణి కాలేకపోయా నన్నది వేరే విషయం. 